నెహ్రూ బాల పుస్తకాలయం

# వన్యమృగ సంరక్షకుని సాహసాలు

రచన

ఇ.ఆర్.సి. దావిదార్

చిత్రాలు

శేఖర్

అనువాదం

పోతుకూచి సాంబశివరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# దొంగ వేటగాళ్ళతో సాహసం

ఎత్తయిన పర్వత శ్రేణి పాదంలో కూాకల్ వన్యమృగ అభయారణ్యం విస్తరించి ఉంది. ఒక పర్వత ఏటవాలు ప్రదేశం, కొన్ని పర్వతపాదాలు, కొంత సమతల ప్రదేశం కలిసి ఈ అభయారణ్యం ఏర్పడింది. అది చక్కని అరణ్య ప్రదేశంగా రూపొంది, అనేక రకాల వన్యమృగాలకు నివాస స్థానమైంది. కూాకల్ సాధారణంగా పచ్చగా, చీకటిగా, చల్లగా ఉంటుంది. ఎండా కాలంలో మాత్రం చాలా వేడిగా పొడిగా ఉంటుంది. సంవత్సరాలు గడుస్తున్న కొలదీ అది ఇంకా వేడిగా, పొడిగా తయారయింది. ఒకసారి మంచి ఎండా కాలంలో కూాకల్‌లోను ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలలో కూడా కరువు ఏర్పడింది. అలా అంతకుముందు ఎప్పుడూ జరగలేదు.

ఆ అభయారణ్యంలో నుంచి ప్రవహించే 'నెల్లిఒడై' అనే నది జ్ఞాపకమున్నంతవరకు మొట్టమొదటిసారిగా ప్రవహించడం మానేసింది. ఆ నది ఎండిపోయి, అక్కడ కూడ చిన్న గుంటల వంటి వానిలోనూ పల్లపు ప్రదేశంలోనూ కొన్ని నీళ్ళు నిలిచాయి. త్వరలోనే ఆ నీరు కూడా ఒకదాని తర్వాత ఒకదానిలో ఎండిపోతూ చివరికి కాస్త లోతుగా ఉన్న రెండు గుంటలలో మాత్రం నీళ్ళు మిగిలాయి. ఆ అభయారణ్యంలో నివసించే కొండజాతుల వారు ఎండిపోతున్న నదిలో సులభంగా దొరుకుతున్న చేపలను తమ ఆహారంగా ఎక్కువగా వాడుతున్నారు. అయినప్పటికీ వారు బాధపడుతున్నారు. వచ్చే సంవత్సరం వారు పట్టుకోవడానికి ఇక చేపలుండవని వారికి తెలుసు.

ఆ అరణ్య ప్రవాహం మాత్రమే అక్కడ నీటి వనరు కాదు. ఇంకా కొన్ని చిన్న చిన్న నీటి మడుగులు అక్కడ కూడా ఉన్నాయి. అయితే అవికూడా ఒక్కొక్కటిగా ఎండిపోతున్నాయి. వాటన్నిటిలో పెద్దది, లోతైనది అయిన 'షెన్‌బాగా ఊరాని' అనే మడుగులో మాత్రం నీళ్ళు మిగిలాయి.

కూాకల్‌లో ఈ కరువు పరిస్థితికి కారణం తెలుసుకోవడం కష్టంకాదు. కలప ఖరీదు అమితంగా పెరగడంతో ఆశపడిన భూస్వాములు పర్వత పైభాగాన ఉన్న తమ భూములలోని చెట్లన్నీ నరికి, అమ్మేసి, త్వరగా ధనార్జన చెయ్యాలనుకు

న్నారు. ప్రభుత్వ భూములలో కూడా నిర్దాక్షిణ్యంగా, అక్రమంగా చెట్లని నరికేసిన దొంగలు కూడా అనేక వృక్షాల నష్టానికి కారణమయ్యారు. దాని ఫలితంగా ఆ ప్రాంతంలో వర్షం కురవడానికి సహాయపడే అడవులు పోయాయి. కాబట్టి చాలా కష్టం మీద వర్షం కురిసింది. వృక్షాల యొక్క వేళ్ళు పర్వతాల అంచులలో ఉన్న మట్టిని పట్టి ఉంచుతాయి. అడవులు లేకపోయేసరికి, ఆ మట్టిని ఆపేందుకు ఏదిలేక వర్షం కురవగానే పైనుంచి క్రిందకి పడసాగింది. దానికి తోడు అడవులు కొట్టేసిన తరువాత, ఆభూమిని తీసుకున్న రైతులు దానిని సంరక్షించుకోవడానికి తగిన ఆసక్తి చూపించకపోవడం పరిస్థితిని మరింత క్షీణింప జేసింది. ఆ విధంగా వర్షం కురిసినప్పుడల్లా పర్వతాల పైనుంచి మట్టి పెద్ద మొత్తాలలో జారిపడి, అభయారణ్యంలోని మడుగులనన్నింటిని నింపెయ్యసాగింది.

అడవులు స్పాంజిలాగా కూడా పని చేస్తాయి. అవి వర్షపు నీరు పీల్చుకుని, క్రమంగా ఆ నీటిని వదులుతూ ఊటలు ఏర్పడటానికి కారణమవుతాయి. ఆ ఊటలలో వర్షాకాలం అయిపోయాక కూడా చాలాకాలం వరకు అలా నీరు ఊరుతూనే ఉంటుంది. అడవులు పోవడం వలన కూకల్ లోని నదులని, మడుగులని, పోషించే ఊటలు లేకుండా పోయాయి. అరణ్యాలు ఈ విధంగా మొండికావడం, భూమి హరించుకుపోవడం అనేది ఒక రోజులోగాని, ఒక సంవత్సరంలో గాని జరగలేదు. కొన్ని సంవత్సరాలపాటు ఆ విధంగా జరిగింది. కాబట్టి ఎవరూ దానిని గమనించ లేదు. కాని జరగవలసిన నష్టం జరిగింది. ఫలితంగా తీవ్రమైన కరువు ఆ ప్రాంతంలో వచ్చింది. అంతేగాక తీవ్ర ఆందోళన కలిగించే విషయం కరువు కాటకాలు క్రమం తప్పకుండా సంభవించేటట్లు భయపెట్టడం.

అభయారణ్యంలోని వన్యమృగ జీవితం చాలా బాధలకి లోనయింది. జంతువులలో ముఖ్యంగా లేళ్ళు, జింకలు వంటివి నీటిగుంటల మీద ఎక్కువ ఏకాగ్రత చూపడంతో పెద్ద పులులు, చిరుతపులులు, వేటకుక్కల వంటి జంతువులకి వానిని వేటాడటం సులభమయింది.

ఆ వన్యమృగ సంరక్షకుడు, అభయారణ్య అధికారి అయిన చంద్రన్ చాలా విచారించాడు. వన్య జీవులు అవి జంతువు కానీ, పక్షికానీ, మొక్కగానీ, వానిని సంరక్షించడం అతని బాధ్యతలలో మొదటిది.

అతను ప్రభుత్వానికి, అటవీ శాఖ మంత్రికి, అభయారణ్యంలోని వన్యమృగ

జీవనానికి సంఘ. ౧ని దుస్థితిని వివరిస్తూ వ్రాశాడు. ఇక ముందైనా అడవులు కొట్టివేయకుండా తగిన చర్యలని తీసుకుని, పర్వతాల వాలులో ఎక్కడ వీలయితే అక్కడ అడవులు పెంచాలని అతను వారిని అర్థించాడు. వెంటనే తగిన చర్యలు తీసుకోక పోతే కూకల్ అభయారణ్యం మరి ఉండదని అతను హెచ్చరించాడు. ఈ కరువు పరిస్థితి మరింత త్వరలో పరిష్కారం చూపాలని సూచించింది. అభయార ణ్యంలోని వన్యమృగ జీవితం ఆనందంగా సంతోషంగా సాగటానికి తన వైపునుంచి తను చేయగలిగిందంతా చేశాడు.

వన్యమృగ సంరక్షుడైన చంద్రన్‌కి ఎండాకాలం ఎప్పుడూ కష్టసమయంగానే ఉంటుంది. ఈసారి కరువు పరిస్థితిని మరింత కష్టతరం చేసింది.

## II

అభయారణ్యంలో నీళ్ళు లభించే ప్రదేశాలు తక్కువగా ఉండటంతో దొంగవేటగా ళ్ళకి ఆకర్షణ ఎక్కువయింది. అసలు దొంగతనంగా వేటాడటం అనేది చాలా తప్పు. కాని, దాహంతో అలమటిస్తున్న జంతువులు తమ దాహం తీర్చుకోవడానికి వచ్చినపుడు వేటాడటం అనేది నేరమే కాక క్రూరమైన పని కూడా. దొంగతనంగా వేటాడే వాళ్ళు వాళ్ళు ఉపయోగించే పద్ధతులు న్యాయమైనవా, కావా? మంచిదా, కాదా? అని ఆలోచించరు. వాళ్ళకి కావలసిందల్లా ఎర. ఎన్ని జంతువులని వేటాడగలిగితే అంత సంతోషపడతాడు. అతను వాళ్ళని పట్టుకొని, శిక్షించి, వాళ్ళకి ఒక పాఠం నేర్పాలి.

దొంగ వేటగాళ్ళని అరికట్టడానికి చంద్రన్ అనేక ముందు జాగ్రత్తలు తీసుకు న్నాడు. అతను చాలా ధైర్యస్థుడు. అడవిలో తరుచుగా సంచారం చేస్తూ ఉండే వాడు. ఒక్కోసారి జీప్‌లోను, ఒకోసారి కాలి నడకను వెళుతూ ఉండేవాడు. ఒక రోజు సాయంత్రం అతను జీప్‌లో తిరుగుతున్నప్పుడు దూరంగా తుపాకీ పేలిన శబ్దాలు విన్నాడు. ఆ శబ్దాలు దారికి దూరంగా లోపలికి ఉన్న 'షెన్‌బాగా ఊరాని' వైపునుంచి వచ్చాయి. అక్కడ దొంగవేటగాడు తన పనిలో ఉన్నాడని చంద్రన్‌కి నమ్మకం కుదిరింది.

వన్యమృగ సంరక్షుడు తన సరిహద్దు కాపలాను శక్తివంతం చేసినప్పటికీ, ఆ దొంగ వేటగాడు తప్పించుకున్నాడు. ఇకముందు దొంగలని పట్టాలంటే వన్యమృగాలకి నీటి రంధ్రాలుగా ఉపయోగ పడే నీటి మడుగుల వద్ద వారిని ట్రాప్ (పట్టుకోవటం)

చెయ్యడం బాగుంటుందని చంద్రన్ ఆలోచించాడు.

మరుసటిరోజు అతను కొంతమంది గార్డులని, వాచర్‌లని, మూడు సమూహాలుగా విభజించి, రెండు సమూహాలని, ఫారెస్టర్‌ల ఆధ్వర్యంలో రెండు నీటి మడుగుల వద్దకి పంపాడు. మూడవ సమూహంలో గార్డు రాజు, ఆలగిరి, చంద్రన్ చిన్నకొడుకు మోహన్, చంద్రన్ ఆధ్వర్యంలో 'షెన్‌బాగా ఊరాని' వైపు బయలుదేరారు. మోహన్ తన పాఠశాలకి సెలవులు కావడంతో ఇంటికి వచ్చి వున్నాడు. తన తండ్రితో తాను కూడా వస్తానని బ్రతిమిలాడటంతో తండ్రి అయిష్టంగానే ఒప్పుకున్నాడు.

సగం దూరం వెళ్ళాక చంద్రన్ అడ్డదారిలో వెళదామని నిశ్చయించుకున్నాడు. ఆ మార్గమంతా ఎత్తుగా పెరిగిన వెదురుచెట్లతో నిండిన ఒక ఇరుకైన కనుమలో



నుంచి వెళ్తుంది. దారి అంతా మసక చీకటిగా ఉండి, వారు ఎక్కువ దూరం చూడలేక పోతున్నారు. ఆ మార్గం చాలా ప్రమాదకరమైనదిగా పరిగణించబడింది. సాధారణంగా ఏనుగులు అక్కడికి వచ్చి, వెదురు చెట్లని తిని, ఎండ తీవ్రతనుంచి తప్పించుకోవడానికి అక్కడి చెట్లనీడను విశ్రమిస్తుంటాయి.

చంద్రన్‌కి ఈ ప్రమాదాల గురించి తెలుసు కనుక తన మనుషులను జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాడు. గాలి కూడా వారికి అనుకూలంగా ఉంది. వారి ముఖాల మీదికి వీస్తుంది గాని, వారికి వ్యతిరేకంగా దూరంగా వీచడం లేదు. అది, మనుషుల వాసనని జంతువులకు మోసుకెళ్ళడాన్ని ఆపింది. ఒంటరి ఏనుగుల గురించి ఎక్కువగా భయపడుతున్నాడు. ఏనుగుల మందలు సాధారణంగా గోలగోలగా ఉంటాయి. కాని, ఒంటరి ఏనుగులు మాత్రం నిశ్శబ్దంగా గమనిస్తూ ఉంటాయి. కొన్ని ఏనుగులు తమకంటె శక్తివంతమైన ఏనుగుల వల్ల తమ మందనుంచి తరిమివేయబడతాయి. కొన్ని తమ ముసలి తనంలో ఒంటరివై పోతాయి. ఇంకా మరికొన్ని ముఖ్యంగా యువ్వనంలో ఉన్న ఏనుగులు తమ మందలోని క్రమశిక్షణను తప్పించుకోవడానికి మందనుంచి తాత్కాలికంగా వేరుపడతాయి. ఈ ఒంటరి ఏనుగులు సాధారణంగా చాలా కోపదారులుగా కలహప్రియులుగా ఉండి, మనుషులంటే అయిష్టంగా ఉంటాయి.

చంద్రన్, అతని సమూహం తరచుగా ఆగి, విని, తర్వాత ప్రయాణం సాగిస్తున్నారు. చిన్నవాడైన మోహన్ ఏదయినా ప్రమాదం ఎదురైతే ముందు పారిపోవడానికి వీలుగా అందరికంటె వెనుక నడుస్తున్నాడు. అప్పుడప్పుడు పక్షుల పాటలు, వెదురుపొదల రాపిడి శబ్దం, కీచురాళ్ళ కూతలు తప్ప ఆ కనుమ అంతటా నిశ్శబ్దం వ్యాపించి ఉంది. వారంతా ఒక మలుపులోకి వచ్చారు. అకస్మాత్తుగా వారికి కుడివైపున దారి కడ్డంగా నిలబడి వున్న భయంకరమైన ఒక ఏనుగు కన్పించింది. ఆ ఏనుగు దంతాలు మిగిలిన ఏనుగుల దంతాలవలె ఒకదానికొకటి సమాంతరంగా ఉండక, వంపుతిరిగి, తొండం మీదుగా ఒకదాని పైకి ఒకటి వచ్చి ఉన్నాయి. అటువంటి ఏనుగులు చాలా ప్రమాదకారులుగా భయంకరంగా ఉంటాయి. వీళ్ళు దాన్నిచూసి, వెనక్కు తిరిగి పరిగెత్తడం మొదలుపెట్టగానే, ఆ ఏనుగు వాళ్ళని చూసింది. గట్టిగా ఘీంకరిస్తూ అది వారి వెంట పడింది. అది చాలా భయం కలిగిస్తూ ఉంది. వాళ్ళందరిలో పొట్టిగా, లావుగా ఉన్న రాజు వాళ్ళతో సమానంగా పరిగెత్తలేక వెనకబడ్డాడు. ఆ ఏనుగు దాదాపుగా రాజుమీద పడబోతున్నపుడు అతని యూనిఫార్మ్‌లో ఒక భాగమైన

పచ్చని తలపాగా కింద పడి పోయింది. అది కింద పడగానే ఊడిపోయి, రోడ్డంతా పరుచుకు పోవడంతో ఆ ఏనుగు రాజే పడిపోయి, రోడ్డుమీద పొడవుగా సాచుకున్నాడు అనుకుంది. అక్కడే ఆగి, మితిమీరిన కోపంతో ఆ గుడ్డని తనకు చేతనయినంతగా ముక్కలు ముక్కలు చేసి పారేసింది. అది మనిషి కాదని, గుడ్డ అని తన తప్పు తాను తెలుసుకునేసరికి చంద్రన్, అతని మనుషులు చాలా దూరం వెళ్ళిపోయారు.



# III

అదృష్టం కొద్దీ ఆ ప్రమాదం వారికి కొంచెంలో తప్పింది. ఆ ఏనుగు వారిని వెంబడించడం లేదని ధ్రువపరచుకున్న తరువాత వారంతా కొద్దిసేపు విశ్రాంతి కోసం ఆగారు. చంద్రన్ వంటి అనుభవశాలియైన ఫారెస్ట్ ఆఫీసరుని కూడా బలహీనుని చేసే అనుభవం అది. అతని చిన్న కొడుకును గురించి అతను ఎక్కువ భయపడుతున్నాడు. కాని, మోహన్ మాత్రం భయపడలేదు. పైగా ఆ సాహసానుభవం ద్వారా అతను గగుర్పాటుని, ఉద్రేకాన్ని పొందాడు. "నువ్వు ఇంటికి వెళ్ళిపోతావా?" అని చంద్రన్ అడిగాడు. కాని, ఆ బాలుడు వారితోబాటు ముందుకి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు.

వన్యమృగ సంరక్షణాధికారి 'షెన్‌బాగా ఊరాని'కి మధ్యాహ్నానికల్లా చేరుకొని, దొంగవేటగాళ్ళు అక్కడ ఉన్నప్పుడే పట్టుకోవాలని ఆశించాడు. కాని, ఆ ఏనుగు వల్ల వారికి ఆలస్యమయింది. దానితో చంద్రన్ తన ఉద్దేశ్యం మార్చుకున్నాడు. దొంగవేటగాళ్ళని ట్రాప్ చేసే పద్ధతిని వదిలి, వారిని ప్రత్యక్షంగా ఎదుర్కోవాలని ఆలోచించాడు. మడుగు సమీపంలోకి రాగానే తన మనుషులని అక్కడక్కడా దాగి, నిశ్శబ్దంగా ఉండమని గుసగుసగా చెప్పాడు. తరువాత అతను పొదలచాటుగా తన రెండు కాళ్ళు, రెండు చేతుల మీద మెల్లిగా నడుస్తూ జాగ్రత్తగా ముందుకి కదిలాడు. అక్కడంతా ఎండిన ఆకులు రాలి పడి ఉండటంతో అతను తన అడుగులు వానిమీద



పడకుండా జాగ్రత్త వహించలేకపోతే ఆ ఆకులు కదిలిన శబ్దం అతనిని పట్టేస్తుంది. అతనికి ఆ మడుగు పరిసరాలు చక్కగా కనబడే ప్రదేశం చేరిన తరువాత, బైనాక్యులర్స్ తీసి, ఆ చుట్టుప్రక్కల అడవి ప్రదేశం అంతా పరీక్షగా చూశాడు. ఆ మడుగు చుట్టూ ఎన్నో చెట్లు ఉన్నాయి కాని, వానిలో కొన్ని ఆకులు రాలిపోయి మోడుగా ఉన్నాయి. కొన్ని అప్పుడప్పుడే చిగురిస్తున్నాయి. మిగిలినవి మంచె కట్టడానికి కావలసినంత పెద్దగా లేనివి ఉన్నాయి. అయితే, అక్కడ చాలా పెద్ద మామిడిచెట్టు ఒకటి ఉంది. దాని కొమ్మలలో ఎంత మందయినా దాక్కోవచ్చు అన్నట్లుగా విస్తరించి ఉన్నాయి. చంద్రన్ ఆ చెట్టుమీదనే తన దృష్టిని కేంద్రీకరించాడు. చాలా కష్టంమీద అతను ఆ చెట్టు మధ్యలో బాగా దట్టంగా ఉన్నచోట ఒక మంచె కట్టే ఉండటం చూశాడు. అది నేలమీద నుండి ఆరుమీటర్ల ఎత్తులో ఉంది. అదికూడా చెట్టులో భాగంగా కన్పించాలని మంచె అంతా ఆకులతో కప్పబడి ఉంది.

బాగా పరిశీలించి చూశాక ఆకుల మధ్య నుంచి తొంగిచూస్తున్న కొన్ని గొట్టపు రంధ్రాలని వన్యమృగ సంరక్షకుడు చూశాడు. అవి రెండు తుపాకీ గొట్టాలుగా అతను గుర్తించాడు. దొంగవేటగాళ్ళు జాగ్రత్తగా దాక్కున్నా ఆ తుపాకీ గొట్టాలు వాళ్లని పట్టిచ్చాయి.

చంద్రన్ మళ్ళీ వెనక్కి తన మనుషుల వద్దకు పాక్కుంటూ వెళ్ళి, తను వారిని ఎదుర్కోబోయే పద్ధతిని వివరించాడు. కాని, ఆలగిరి "వారిని ఒంటరిగా ఎదుర్కోవడం చాలా ప్రమాదకరమని" అందుకు అభ్యంతరం చెప్పాడు.

రాజుకూడా అతనితో ఏకీభవిస్తూ "మనందరం ఒక్కసారిగా వెళ్ళి వాళ్ళని ఎదుర్కొందామని" సూచించాడు.

కాని చంద్రన్ తన పద్ధతే మంచిదని ఆలోచించాడు. తన ఆజ్ఞలకే లోబడి ఉండమని వారికి చెబుతూ, అతను ఒంటరిగా, ధైర్యంగా ముందుకి వెళ్ళాడు. మోహన్ ఒక చెట్టు చాటున నిలబడి, చంద్రన్ వెళ్ళడం చూశాడు. తండ్రి రక్షణ గురించి భయపడినా, ఆయన ధైర్యసాహసాలకి కొడుకు గర్వపడ్డాడు.

వన్యమృగ సంరక్షకుడు మంచెని సమీపిస్తూ, తుపాకీ గొట్టాలు వెనక్కి తీసుకోబడినట్లు గమనించాడు. మామిడి చెట్టు క్రింద ఆగి, అతను ఆ దొంగ వేటగాళ్ళని క్రిందికి రమ్మని ఆజ్ఞాపించాడు. "మీరక్కడ ఉన్నారని నాకు తెలుసు" అని అతను పిలిచాడు. కానీ, వాళ్ళు కదలలేదు. అతడు మళ్ళీ వాళ్ళకి తన ఆజ్ఞ వినిపించాడు.

ఆ దొంగ వేటగాళ్ళలో ఒకడు "నీకు చేతనయితే నువ్వే వచ్చి పట్టుకో" అని మొండిగా సమాధానమిచ్చి, తన తుపాకీని చంద్రన్ వైపుకి గురిపెట్టాడు.

ఇది అతనికి చాలా కోపం తెప్పించింది. "నేను ఒంటరిగా లేను నా మనుషులు మిమ్మల్ని చుట్టుముట్టి ఉన్నారు" అని అతను గట్టిగా అరిచాడు. ఆ అరుపు అతని గార్డులకు ఒక సూచన కూడా. ఆ సూచన నందుకొని, వారు గట్టిగా ఈలలు వేస్తూ, మరికొంత దూరం జరిగి, మళ్ళీ ఈలలు వేస్తూ ఆ మడుగు చుట్టూ అనేకమంది చుట్టుముట్టి ఉన్నట్లు దొంగవేటగాళ్ళను భ్రమ పెట్టడానికి ప్రయత్నించారు. మోహన్ ఎండిన ఆకులపై తన పాదాలతో శబ్దం చేస్తూ, తన తండ్రి ఈలకి బదులిస్తూ దట్టంగా ఉన్న ప్రదేశంలో పడుకుని ఉన్న కణుజుల మంద ఈ శబ్దాలకి కంగారుపడి, మడుగు చుట్టూ గుండ్రంగా పరిగెడుతూ ఆ గొడవకి మరింత గొడవని జోడించాయి.

దొంగవేటగాళ్ళు చాలా చతురత కలిగిన జిత్తులమారివాళ్ళు. "అడవిలో వాళ్ళు చాలామంది వున్నట్లయితే ఎందుకు మనకి కనబడకుండా దాక్కున్నారు?" అని వాళ్ళలో వాళ్ళు తర్కించుకున్నారు.

చంద్రన్ వారి ఆలోచనలని పసిగట్టి, తన గుట్టు ఎక్కడ గ్రహిస్తారో అన్న భయంలో అతను తనమనుషులని "వీళ్ళు క్రిందికి వచ్చేవరకు మీరెవరూ దాక్కున్న చోటునుంచి బయటికి రావద్దు. ఎవరూ గాయపడటం నాకిష్టంలేదు" అంటూ కేకవేశాడు.

ఇది, దొంగవేటగాళ్ళు తాము అనేకమంది వార్డెన్ మనుషులతో చుట్టు ముట్టబడి వున్నామని నమ్మేలా చేసింది. చివరగా చంద్రన్ వారిని "మీరు కిందికి దిగిరాకపోతే నేనే తిన్నగా ఎక్కివచ్చి మిమ్మల్ని కిందికి పడవేస్తాను" అని హెచ్చరిస్తూ నిచ్చెన ఎక్కడం ప్రారంభించాడు.

దొంగవేటగాళ్ళు ధైర్యం కోల్పోయి, ఇంకేమీ ఆలోచించలేదు. వాళ్ళు కిందికి రాగానే చంద్రన్ వాళ్ళ దగ్గరున్న ఆయుధాలు తీసేసుకున్నాడు. అప్పుడు ఇద్దరు గార్డులు, మోహన్ వాళ్ళని కలుసుకొనడానికి బయటికి వచ్చారు. తాము వేసిన పథకం ఫలించినందుకు ఉపశమనం పొందారు. ఇద్దరు గార్డులని, చిన్న కుర్రవాడిని చూడగానే ఆ దొంగవేటగాళ్ళు సిగ్గుపడ్డారు. అకస్మాత్తుగా వారిలో ఒకనికి ఒక ఉపాయం స్ఫురించింది. తను గనుక మోహన్‌ని పట్టుకోగలిగితే అతనిని అడ్డు

పెట్టుకొని, తప్పించుకోవచ్చుననుకున్నాడు. మోహన్ వారిని సమీపించగానే దొంగవేటగాళ్ళలో ఒక వ్యక్తి అతని వేటకత్తిని తీసి, మోహన్‌ని పట్టుకునేందుకు అతని వైపు ఉరికాడు. కానీ, మోహన్ తండ్రి అతనికంటె చురుకైన వాడు. ఆ దొంగవేటగాడు అతని చేతులు కుఱ్ఱవానిమీద వేసినప్పటికే, చంద్రన్ వారి మధ్యకి దూకి, ఒక్క పిడి గుద్దుతో ఆ వ్యక్తిని పడగొట్టాడు. దానితో ఆ దొంగ వేటగాళ్ళలో ఏ మూలో ఉన్న దెబ్బలాడే ఆశకూడా పోయింది. గార్డులు వెంటనే వారి చేతులకి సంకెళ్ళు బిగించి, వారు మళ్ళీ ఏ అఘాయిత్యానికి పాల్పడకుండా జాగ్రత్తపడ్డారు. తరువాత, ఆ దొంగవేటగాళ్ళని పోలీసు స్టేషను వైపుకి నడిపించుకుతీసుకుపోయారు.



# వక్రదంతాల ఏనుగుని వేటాడటం

వన్యమృగ సంరక్షకుడు చంద్రన్ తన ఆఫీసులో పని చేసుకుంటున్నప్పుడు ఒక వ్యక్తి పరిగెత్తుకుంటూ వచ్చి, అతని బల్ల దగ్గర ఆయాసపడుతూ కింద పడిపోయాడు. అతని శరీరం రక్తం ఓడుతూ, దుస్తులు చిరిగి పీలికలైపోయి ఉన్నాయి. వార్డన్ ఒక్కసారిగా అతని ప్రక్కకి వెళ్ళి, గాయాలని పరీక్షించాడు. అవి అంత లోతుగా లేవు కాని, అతని చర్మం మాత్రం అనేక చోట్ల చిట్లిపోయి ఉంది. ఆ మనిషి చాలా భయపడి పోయి ఉన్నాడు. లేకపోతే అతనికి వచ్చిన ప్రమాదం ఏమీ లేదు.



అతని గాయాలకి చికిత్స జరిగింది. అతను కోలుకున్న తరువాత వార్డన్ అతన్ని ప్రశ్నించాడు.

ఆ వ్యక్తి తన కథని ఈవిధంగా చెప్పాడు. అతను తన స్నేహితునితో కలిసి, ఎప్పటిలానే ఆ రోజు కూడూ ఎండు కట్టెలు ఏరుకోవడానికి కూకల్, అరణ్యానికి వచ్చారు. అరణ్యంలో ప్రవహిస్తున్న 'నెల్లిఒడై' నది సమీపానికి వచ్చేసరికి, అక్కడ దట్టంగా ఉన్న చెట్లలోనుంచి ఒక ఏనుగు వారిమీద దాడి చేసింది. వాళ్ళిద్దరూ పరిగెత్తారు. అతని సహచరుని కంటె ఆ వ్యక్తి ఏనుగుకి దగ్గరగా ఉన్నాడు. ఏనుగు దాదాపుగా అతనిపైన బడుతున్నపుడు అతను తొట్రుపాటుతో కిందపడి పోయాడు. దానితో తనకి చివరి క్షణాలు సమీపించాయని అతననుకున్నాడు. కానీ, అదృష్టం కొద్దీ అతను పైకి కనబడకుండా ఉన్న చిన్న గుంటలో పడిపోయాడు. ఆ ఏనుగు ఆగకుండా అతన్ని దాటి, అతని సహచరుని పట్టుకొని, చంపేసింది. ఆ వ్యక్తి విపరీతంగా భయపడిపోయి, నిశ్చేష్టుడైనప్పటికీ, తేరుకొని, లేచి ముళ్ళపొదలు గాయపరిచినా, తన దుస్తులని పీలికలు చేసినా లెక్కచేయక గుడ్డిగా అడవిలో పడి, పరుగుతీస్తూ వచ్చి, వార్డెన్ చంద్రన్ ఆఫీసులో పడ్డాడు. ఆ హంతక ఏనుగుకి వంకర దంతాలున్నాయని అతను గుర్తించాడు.

వన్యమృగ సంరక్షణాధికారి తన మనుషులు అనుసరించి రాగా ఆ కట్టెలు ఏరుకునే వానితో సహా అతని మిత్రుడు చంపబడిన ప్రదేశం చేరుకున్నాడు. వక్రదంత ఏనుగు ఇంకా ఆ ప్రదేశం వదలలేదు. చనిపోయిన వ్యక్తి శరీరం వెతకడం కోసరం ఆ ఏనుగుని ముందు దూరంగా తరమవలసి వచ్చింది.

సంరక్షణాధికారి ఈ చావు విషయం వన్యమృగ ముఖ్య సంరక్షణాధికారికి వార్త పంపవలసి ఉంది. అందుకోసరం అతను ముందుగా ఆ హంతకుని గుర్తించడంలో స్వయంగా తృప్తి చెందాలి. చనిపోయిన వ్యక్తి పక్కన ఉన్న పాదాల గుర్తులు వక్రదంతపు ఏనుగు పాదాల గుర్తులకి సరిపోయాయి. వక్రదంతిఇంకా ఆ ప్రాంతంలోనే ఉండటం కూడా పరిస్థితిని ఇంకా సులభం చేసింది. కనుక చంద్రన్‌కి వక్రదంతియే హంతకుడని చెప్పిన కట్టెలు కొట్టేవాని కథ అంగీకరించడం కష్టంగా తోచలేదు. ఆవిధంగానే రిపోర్టు వ్రాసి పంపబడింది.

వన్యమృగ ముఖ్య సంరక్షణాధికారి కొంతకాలం నుంచి వక్రదంత ఏనుగు యొక్క దుష్ట ప్రవర్తనని గురించిన ఆరోపణలు వింటూనే ఉన్నాడు. కాని, ఆయన ఆ

ఏనుగు ఏదో తాత్కాలికమైన వ్యాధితో బాధపడుతుందనీ, దాని ప్రవర్తన మార్చు కుంటుందనీ భావిస్తూ దాని మీద ఏ విధమైన చర్యా తీసుకోలేదు. వన్యమృగ సంరక్షణాధికారి వక్రదంతి యొక్క దురాగతాన్ని గురించి పంపిన రిపోర్టు చదివిన తరువాత, ఆయన ఆ ఏనుగుకి తన ప్రవర్తన మార్చుకోవడానికి తగినంత సమయం ఇచ్చాననీ, కనుక ఇప్పుడు దానిపై ఏవిధమైన జాలి చూపనక్కరలేదనీ భావించాడు. ఏమాత్రం సంకోచించకుండా ఆయన వక్రదంత ఏనుగుని కాల్చి చంపడానికి అను మతి కోసరం రాష్ట్ర ప్రభుత్వానికి దరఖాస్తు పంపాడు. వన్యమృగ సంరక్షణా చట్టం క్రింద అడవి ఏనుగులు తమ రక్షణకి ఏమాత్రం భంగం కలుగుకుండాను, వానికి ఏవరూ హాని చెయ్యకుండాను హక్కును పొంది ఉండటంతో ఆ విధమైన అనుమతి పొందవలసి ఉంటుంది. అందులోనూ అభయారణ్యాలలో ఉన్న జంతువుల విషయంలో తప్పకుండా రాష్ట్ర ప్రభుత్వానుమతి పొందడం అవసరం.

తన రిపోర్టుని పంపించిన తరువాత, సంరక్షణాధికారి చంద్రన్ పరిస్థితినంతా మరో మారు లోతుగా ఆలోచించాడు. ఆ వక్రదంతపు ఏనుగు అభయారణ్యానికి కొత్త కాదు. అది అరణ్యపు సరిహద్దులలో ఉన్న పొలాలపై కూడా అప్పుడప్పుడు దాడిచేస్తూ ఉంది. పొలాలలో పంటలు లేనపుడు, లేదా గ్రామస్థులు దానిని తొందరపెట్టి పీడించినపుడు అది అరణ్యపు లోపలి వైపుకి వచ్చేసేది. అప్పుడది మామూలుగానే ప్రవర్తించేది కాని, ప్రజలు దానికి సమీపంలోకి వచ్చినపుడు లేదా దానిని తొందర చేసినపుడు మాత్రం ప్రతీకారం చేసేది. గ్రామస్థులు తరుచుగా దానిపై రాళ్ళు, కఱ్ఱలు, కాగడాలు విసరడం, వారి పొలాలపై దాడి చేసినపుడు ఎప్పుడన్నా ఒకసారి పాత తుపాకిలతో దానిపై కాల్పులు జరపడం చేసేవారనేది నిర్వివాదాంశం. కాని, అది ఎప్పుడూ ఎవరికీ ఏ హానీ చెయ్యలేదు. అయితే ఈ సారి వచ్చినపుడు మాత్రం అది మనుషుల వెంటబడి తరుముతూ ఉంది. ఇప్పటికే అది అభయారణ్యం బయట ఇద్దరిని, లోపల కట్టెలు కొట్టేవానిని, మొత్తం ముగ్గురిని చంపేసింది.

"సర్ ఈ వక్రదంత ఏనుగు ప్రవర్తనకి కారణం అతని దంతాలు వంకరగా నిర్మాణమై ఉండటమే అనుకుంటాను" అని సూచించాడు వన్యమృగాధికారి మొహిదీన్.

"ఆ సంగతి నువ్వెలా చెప్పగలవు?" అని చంద్రన్ అడిగాడు. దానికి కారణం: "ఇతర ఏనుగుల వలె అది తన తొండాన్ని స్వేచ్ఛగా కదిలించలేక రోషంతో తన కోపాన్ని ప్రజలపై తీర్చుకోవాలనుకుంటుంది." అని మొహిదీన్ సమాధానమిచ్చాడు.

"అదే కారణమైతే ఏనుగు ఇంతకు ముందునుంచే చంపడం మొదలుపెట్టి ఉండ వలసింది. ఇప్పుడు ఎందుకు" అని చంద్రన్ మొహిదీన్ మాటని త్రోసిపుచ్చాడు గాని, అనుమానంతో అతను బాధపడుతూనే ఉన్నాడు.

మగ ఏనుగుల దుష్ప్రవర్తనకి కారణం ఒకటి.... కొంతప్పుడు అవి ఒక విధ మైన ఉన్మాదస్థితిలో ఉంటాయి. ఆ స్థితి వానికి జంటకట్టే కాలంలో కలుగుతూ



ఉంటుంది. ఆ స్థితిలో ఉన్న ఏనుగు తరుచుగా ఉద్రేకపడుతూ, తేలికగా కోపం తెచ్చుకుంటుంది. అయితే ఆ స్థితిలో ఉన్న ఏనుగులని సులభంగా గుర్తుపట్టవచ్చు. ఎందుకంటే ఆ మార్పుకి కారణమైన గ్రంధులు ఏనుగు ముఖంమీద కంటికి, చెవికి మధ్యగా ఇరు ప్రక్కలా ఉండి, ఆ స్థితి కలిగినప్పుడు పగిలి, ఒక నూనె వంటి పదార్థం స్రవించి, ఏనుగు చెంపలమీద చారికలను ఏర్పరుస్తుంది. వన్యమృగ సంరక్షణ ఉద్యోగులలో ఎవరూ కూడా వక్రదంతపు ఏనుగు హంతకునిగా మారినపుడు ఆ స్థితిలో ఉందేమో దగ్గరగా చూడలేదు.

గాయాలతో గాని, వ్యాధితో గాని బాధపడే ఏనుగులు కూడా దుష్ప్రవర్తనని చూపిస్తాయి. కాని, ఇవి తాత్కాలికమైన వైకల్యాలు. బహుశా వక్రదంత ఏనుగు హంతకునిగా మారడానికి ఈ కారణాలలో ఒక దానివల్ల కావచ్చునేమో!

వక్రదంత ఏనుగు యొక్క వైకల్యం తాత్కాలికమైనదో శాశ్వతమైనదో కాలమే నిర్ణయించాలి. చంద్రన్ అన్ని జంతువులను ఎంతగానో ప్రేమించి, వాటి పట్ల ఎంతో బాధ్యత తీసుకుంటాడు. ఆ వక్రదంత ఏనుగుని గురించి అతను విపరీతంగా బాధ పడుతూ, ఏది ఏమయినా సరే ఆ జంతువులకి కొంత సమయమిచ్చి, జాగ్రత్తగా కనిపెట్టాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

అందుకే అతను ముఖ్య సంరక్షణాధికారికి జాబు వ్రాస్తూ వక్రదంతపు ఏనుగుకు మరొక అవకాశం ఇవ్వమని, దానిని కాల్చడానికి ఉత్తర్వు ఇచ్చే ముందు ఒక వారం గడువు ఇవ్వమని అర్థించాడు. అదే సమయంలో రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఆ ఏనుగుని కాల్చివెయ్యడానికి అనుమతి లభించింది. చంద్రన్ యొక్క అర్థింపుకి ముఖ్య సంరక్షణాధికారి మనసు మెత్తబడి, అతని కోరికని మన్నించాలనుకున్నాడు. అందుచేత తన ఆజ్ఞని ఒక వారానికి పొడిగించడానికి అంగీకరిస్తూ ఆ తరువాత గడువు ఏమాత్రం పొడిగించరాగని షరతు విధించాడు.

వక్రదంతపు ఏనుగుకి ఒక వారం రోజుల దయాభిక్ష లభించాక, వన్యమృగ సంరక్షణాధికారి ఇంకా ఎక్కువ సమయం అడిగి ఉండవలసిందనుకున్నాడు. వారం రోజుల సమయం సరిపోతుందా? అని కూడా అతను తలపోశాడు. కాని, అంతకంటె ఎక్కువ సమయం దొరికితే, ఆ వక్రదంత ఏనుగు చేసే అల్లరికి అతనే బాధ్యత వహించవలసి ఉంటుంది. అందుకే అతను వారం కంటె ఎక్కువ గడువు అడగరాదని నిశ్చయించుకున్నాడు. సమయం చాలా తక్కువగా ఉండటంతో ఆ అధికారి చాలా

త్వరపడవలసి ఉంది.

చంద్రన్ ఏదయినా ప్లాను వెయ్యకముందు ఆ హంతకుని గూర్చి పూర్తిగా తెలుసుకోవలసి ఉంది. ముఖ్య సంరక్షణాధికారి ఉత్తరం అందిన రోజునే అతను ఇంతకు ముందు వారు ఆ ఏనుగుని చూసిన ప్రదేశం నుంచి మొదలుపెట్టి, దాని ఆచూకీ తెలుసుకోమని తన మనుషులని పంపించాడు. ఆ వక్రదంత ఏనుగు అభయారణ్యం వదిలి పోలేదు కనుక దాని ఆచూకీ కనుక్కోవడం వారికి కష్టం అనిపించలేదు. వాళ్ళంతా సాయంత్రానికి తిరిగివచ్చి, ఆ హంతకుని ఎక్కడ చూడవచ్చునో అతనికి తెలియజేశారు.

## II

మరుసటి రోజు ఉదయం అతని కొడుకు మోహన్ గార్డ్ ఆలగిరిలతో చంద్రన్ బయలుదేరాడు. అతను వక్రదంత ఏనుగుని పరిశీలించాలనుకున్నాడు. బైనాక్యులర్స్‌తో బాటుగా , ఒక వేళ వక్రదంత ఏనుగు అల్లరికి పాల్పడితే తమ రక్షణ కోసరం ఒక పెద్ద తుపాకీని కూడా తీసుకున్నాడు. ఒక సురక్షిత ప్రదేశం నుంచి ఏనుగుని పరిశీలించాలనేది అతని కోరిక. సాధారణంగా అయితే అతను మోహన్‌ని తమ వెంట తీసుకెళ్ళేవాడు కాదు. కానీ ఈ ప్రయాణంలో కూకల్ అరణ్యంలో తన కున్న అనుభవంతోనూ, తనమీద విశ్వాసంతోను ఆ హంతక ఏనుగుతో తమ ఆకస్మిక సమావేశం తప్పించుకోగలననే నమ్మకంతో ఉన్నాడు.

వార్డెన్, అతని మనుషులు వక్రదంతపు ఏనుగుని చాలా దూరం నుంచే కనిపెట్టగలిగారు. ఒక కొండ ప్రక్కగా అది మేస్తూ ఉంది. వాళ్ళు దూరంగా ఉన్నప్పటికీ, దాన్ని బాగానే చూడగలుగుతూ, బైనాక్యులర్స్‌తో దానిని పరిశీలించసాగారు.

ఆ ఏనుగు తన తొండాన్ని స్వేచ్ఛగా ఉపయోగించలేకపోవడం వాళ్ళు చూశారు. చిన్న ఏనుగు పిల్లలు అందుకోగలిగే చెట్లకొమ్మలు, వెదురు కాండాలు కూడా దానికి అందుకోవడం కష్టంగా ఉంది. చిన్న చెట్ల కొమ్మలు అందుకోవడానికి గూడా అది తన తలను బాగా పైకెత్తి, తన మెడకు శ్రమ కలిగించవలసి వస్తుంది. కొన్నిసార్లు అది చాలా కష్టంమీద తన తొండాన్ని బయటికి లాగితే తనకి ఉపయోగపడుతుందనే ఆశతో దంతాల మధ్య నుంచి బయటికి లాగడానికి ప్రయత్నిస్తుంది. కాని, అప్పుడు ఆ దంతాలు దాని నోటికి అడ్డం వస్తున్నాయి. మామూలు దంతాలు

గల ఏనుగుల వలె వక్రదంతాలు గల ఏనుగు తన దంతాలని చెట్ల బెరడుని గీకడం వంటి సామాన్య పనులకి కూడా ఉపయోగించలేదు. ఇది దానికి చాలా విసుగు కలిగిస్తుంది. పంటలను తినడం సులభమని బహుశా ఈ ఏనుగు పొలాల మీద దాడి చేస్తుందని చంద్రన్ అనుకున్నాడు.

ఈ విధమైన ప్రత్యేక వక్రదంత నిర్మాణం గల ఏనుగులు నిజంగా అంగ వైకల్యం గలవే. "కానీ, ఈ ఒక్క కారణమే ఆ ఏనుగు కోపోద్రిక్తతకు కారణ మవుతుందా?". ఆ అధికారి దానిని దగ్గరగా పరిశీలించాలనుకున్నాడు.

క్రమంగా ఎండ వేడిమి అధికమవుతూ ఉండటంతో ఏనుగు తినడం ఆపి, నీటి కోసరం చూస్తుంది. నెల్లి ఒడై అక్కడికి అంతదూరం లేక పోవడంతో వార్డెన్ వక్రదంతి ఆ మడుగుకే నీటికోసరం వెళుతుందని ఊహించాడు. దానితో అత నికి ఏనుగుని దగ్గరగా పరిశీలించే అవకాశం కలుగుతుంది. అతను గార్డులతో తన ఊహ చెప్పినపుడు వారిద్దరూ ఆ ఏనుగు వెళ్ళే మార్గం అదే కావచ్చని, అతనితో ఏకీభవించారు.

వార్డెన్ ముందు నడుస్తుండగా మిగిలిన ముగ్గురూ అడవిలోని అడ్డ దారిని జాగ్ర త్తగా, నిశ్శబ్దంగా ముందుకి కదిలారు. కొద్ది సేపటిలోనే వారు అనుకున్న ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ వాళ్ళు ఏనుగు సమీపించలేనంత ఎత్తుగా ఉన్న ఒక రాయిని చూశారు. ఆ రాయికి మూడు ప్రక్కలా పదునుగా ఉండి, నాలుగో ప్రక్క మాత్రం ఏటవాలుగా భూమిలోకి పాతుకుని ఉంది. వారు, ఆ రాయిలో ఉన్న పగుళ్ళను మెట్లుగా చేసుకుని, అతి కష్టంమీద దాని పైన ఎక్కారు. ఆ రాయి పైభాగంలో ఉన్న మట్టిలో పెరిగిన కొన్ని పొదలు వాళ్ళు దాక్కోవడానికి చక్కగా ఉపయోగప డ్డాయి. అక్కడ కూర్చుని వాళ్ళు ఎదురు చూడసాగారు.

వాళ్ళు ఎక్కువసేపు ఎదురు చూడకుండానే ఒక జంతువువారున్న రాతి వైపుగా వస్తున్నట్లు శబ్దం వినిపించింది. త్వరలోనే అది వారి దృష్టి పథంలోకి వచ్చింది. అది వక్రదంత ఏనుగు. చాలా నెమ్మదిగా ఏదో బాధతో ఉన్నట్లుగా నడుస్తూ వస్తుంది. అది జంట కట్టబోయేటపుడు సంభవించే స్థితిలో లేదని వారు గమనించారు. ఆ ఏనుగు ముందుకి నడుస్తూ, రాతిమీద ఉన్న మనుషుల వాసన పసిగట్టింది. వాళ్ళు చాలా దగ్గరగా ఉండటంతో దానికి వాళ్ళ వాసన చాలా శక్తివంతంగా వచ్చింది. వెంటనే అది ప్రతి చర్య చూపించింది. గిరుక్కున వెనుతిరిగి, వారి వైపు దూకింది. వాళ్ళు దానికి అందుబాటులో లేకపోవడంతో అది ఒక కాలుని రాతిమీద

వేసి, దంతాల మధ్య నుంచి బయటికి వచ్చిన తొండంతో వారిని చేరుకోవాలని ప్రయత్నించింది. చంద్రన్‌కి, అతని మనుషులకి చాలా ఆత్రుతతో కూడిన క్షణాలవి. ఆ ఏనుగు ప్రయత్నం ఫలిస్తుందా? అని వాళ్ళు ఆశ్చర్యపోతున్నారు. కాని, అది ఓడిపోయింది. దానితో ఆ ఏనుగుకి మరింత కోపం వచ్చింది. కోపంతో ఘీంకరిస్తూ అది ఆ రాతి చుట్టూ తిరుగుతూ, తన దారి కడ్డు వచ్చిన పొదలన్నిటినీ విరగ దొక్కుతూ చిందరవందర చేసేసింది.

మోహన్ స్థానంలో మరో పిల్లవాడెవరయినా ఉన్నట్లయితే భయంతో కింద పడి ఉండేవాడు. కాని, మోహన్ మాత్రం చాలా నిశ్శబ్దంగా ఉన్నాడు. కోపంతో చిందులు వేస్తున్న ఏనుగుని అతను గమనిస్తున్నాడు. మిగిలిన వాళ్ళు గమనించని విషయం ఒకటి అతను చూశాడు. ఆ ఏనుగు మెడమీద ఒక చెవికి కొద్దిగా వెనుకగా ఒక పెద్ద కణితి వంటిది ఉంది. అతను తన తండ్రి దృష్టిని అటు తిప్పాడు. అది చీముతో నిండిన కణితి అని వార్డెన్ దాన్ని చూడగానే గుర్తించాడు. అతని ప్రశ్నకి సమాధానం లభించింది. అతని సందేహం తీరింది. ఆ ఏనుగు దుష్ప్రవర్తనకి కారణం బాధతో కూడిన ఆ పుండు, దాని వంపు తిరిగిన దంతాలు మాత్రం కాదు. ఆ పుండు బాధ ఆ మగ ఏనుగు గమనవేగం కూడా తగ్గించడంతో దాని బారిన పడబోయిన వారిలో చాలామంది తప్పించుకుని పారిపోగలిగారు. లేకపోతే ఇంకా చాలామంది ప్రాణాలు పోగొట్టుకునేవారు.

వక్రదంత ఏనుగు చాలాసేపు ఆ రాతిని చుట్టుముట్టి ఉండలేకపోయింది. సూర్యుడు జాలి లేకుండా తన ప్రతాపం చూపడంతో దానికి అలసట కలుగసాగింది. చివరకి ఆ ఏనుకు పట్టుదలని దాని దాహం జయించి, ముందుకి సాగిపోయేలా చేసింది.

## III

అడవి నుంచి తిరిగి రాగానే వన్యమృగ సంరక్షణాధికారి తన స్నేహితుడు వన్య మృగ శాఖకి సంబంధించిన పశువైద్యుడు అయిన డాక్టర్ రమేష్‌ని, వెంటనే రమ్మని తంతి పంపించాడు. మరుసటి సాయంత్రానికి డాక్టర్ రమేష్ అక్కడికి చేరుకొని, తాను సాధారణంగా బస చేసే చంద్రన్ ఇంటికే తిన్నగా చేరుకున్నాడు.

టీ తీసుకునే టప్పుడు చంద్రన్ వక్రదంత ఏనుగు గురించి డాక్టర్ రమేష్‌కి వివరంగా చెప్పాడు. తరువాత అతని ప్లాన్‌లన్నీ డాక్టరు ముందుంచాడు.

"నాకు ఇచ్చిన ట్రాంక్విలైజర్ గన్ గురించి నీకు తెలుసు కదా! నువ్వు ఆపరేషన్ చేసేటట్లయితే నేను ఆ గన్‌తో వక్రదంత ఏనుగుని షూట్ చేస్తాను. అది మత్తులో ఉన్నపుడు నీపని నువ్వు చెయ్యవచ్చు" అన్నాడు. దాని గాయానికి చికిత్స జరిగి, ఆ బాధనుంచి విముక్తిని పొందినట్లయితే అది మంచిగా మారడానికి అవకాశముందని నేను భావిస్తున్నాను అని కూడా అతను అన్నాడు.

డాక్టరు అది వినగానే వెనుకంజ వేశాడు. ఆ విధమైన అర్థింపు అతనికి కొత్త. అంతవరకు అటవంటి అడవి ఏనుగు అందులో హంతకుడయిన వక్రదంత ఏనుగు వంటి దానికి అతనెప్పుడూ శస్త్రచికిత్స చెయ్యలేదు. అతను త్వరగానే తేరుకున్నాడు. పరిస్థితిని జాగ్రత్తగా ఆలోచించాడు. అందులో ప్రమాదం లేకపోలేదు. అయితే ఇటు వంటి కొత్త రకమైన వేటలో ఒక విధమైన ఉద్రేకం కూడా ఉంది. ఆ పశువుల డాక్టరు రోగులు, ఎక్కువగా అటవీ శాఖవారిచే ఉపయోగించబడే ఏనుగులే. అతను వాటిని ఎంతగానో ప్రేమిస్తాడు. ఈ వక్రదంత ఏనుగుమాత్రం వాటి నుంచి ఎలా వేరవుతుంది? అని అతను ఆలోచించాడు.

ఒక ఏనుగు యొక్క ప్రాణం కాపాడే అవకాశం కూడా ఇందులో ఉంది. చంద్రన్ తనకి అపాయం కలుగనీయడని కూడా అతనికి తెలుసు. అతను తన నిర్ణయం తీసుకున్నాడు. వార్డెన్ చేయి అందుకుని, చిరునవ్వు నవ్వుతూ "చాలా మంచిది నేను ఈ పని చేస్తాను" అన్నాడు.

వాళ్ళ సంభాషణ అంతా శ్రద్ధగా వింటున్న మోహన్ "నాన్నగారూ! ఒక వేళ వక్రదంతి తనకు గాయం వున్న వేపుకి పడిపోతే?" అంటూ అనుమానం వ్యక్తం చేశాడు.

"నేను ఆ విషయం ఎప్పుడూ ఆలోచించనే లేదు" అని అతని తండ్రి ఒప్పుకున్నాడు. ఒకసారి కింద పడిన తరువాత అతనిని మరో వైపుకి తిప్పలేము. మనకి మచ్చికయిన ఏనుగయితే ఎంత బాగుండేది అని ఆయన గొణిగాడు.

"ఆ గాయాన్ని రెండు వైపులనుంచీ మనం చేరుకోవచ్చని అనుకుంటున్నాను. అది ఎంత కష్టమయిన పని అయినప్పటికీ మనం చెయ్యాలి" అన్నాడు డాక్టర్ సాలోచనగా.

వార్డెన్ తన ట్రాంక్విలైజర్ గన్‌ని బయటికి తెచ్చాడు. అది జంతువులని తాత్కాలికంగా కదలకుండా ఉంచుతుంది గనుక అతను దానిని స్టైన్ గన్ అని

అంటూ వుంటాడు. ఆగన్ 'కాప్చర్ గన్' అని కూడా పిలువబడుతుంది. ఎందు కంటే జంతువులని పట్టుకోవడానికి ఎక్కువగా ఆ గన్ ఉపయోగపడుతుంది. చంద్రన్ ఇంతకుముందు ఆ గన్‌ని మచ్చల లేడిపై ఉపయోగించాడు.

ఆ అభయారణ్యంలో చాలా ఎక్కువ సంఖ్యలో ఉన్న మచ్చల లేళ్ళను అవి చాలా తక్కువ సంఖ్యలో ఉన్న మరొక అడవికి పంపడం కోసరం ఆ లేళ్ళను పట్టుకోమని అతనికి ఆజ్ఞ వచ్చినపుడు ఆ విధంగా చేశాడు. మామూలు జంతువుల మీద కూడా అతను ఆ గన్‌తో ప్రయోగాలు చేశాడు. ఒక రకమైన మత్తు కలిగించే ద్రవంతో నింపిన బాణముల వంటివి ఆ గన్‌లో అమర్చబడి ఉంటాయి. జంతువును ఆ గన్‌తో పేల్చినపుడు ఆ మత్తు కలిగించే ద్రవం బాణం ద్వారా జంతువు శరీరం లోనికి గ్రుచ్చబడి, కొంతసేపు నిద్రపోయేలా చేస్తాయి.

జంతువులను బట్టి ఆ బాణాలలోకి సరైన మోతాదులో మందును ఎక్కించడం చాలా ముఖ్యం. ఎక్కువ మోతాదులో ఎక్కిస్తే జంతువు చనిపోవచ్చు. తక్కువ మోతాదులో ఎక్కిస్తే అసలు పనిచెయ్యకపోవచ్చు. డాక్టర్ రమేష్‌కి రసాయన ద్రవ్యాల గురించి మంచి జ్ఞానమే ఉంది. అతను, చంద్రన్ కలిసి మందుల గురించి అనేక పుస్తకాలు చూసి, ఇంతకు ముందు జంతువులపై చేసిన ప్రయోగాల అనుభవంతోనూ సరైన పాళ్ళలో, సరైన మోతాదులో మత్తు ద్రవాన్ని తయారు చేయగలిగారు. వక్రదంతి వంటి పెద్ద జంతువుకు మందు గాఢంగానూ, ఎక్కువ మోతాదులోనూ ఉండాలి. భోజనం పూర్తయిన తరువాత, అరడజను బాణాలను ద్రవంతో నింపుకొని, గన్‌ను శుభ్రం చేసి, పనిచేస్తుందో లేదో చూసుకున్నారు. తరువాత వారు వేటకు సిద్ధమయ్యారు.

## IV

తరువాతి రోజు ఉదయం ముఖ్య సంరక్షణాధికారి ఉత్తరం చేరిన నాలుగు రోజుల తరువాత సంరక్షణాధికారి, డాక్టరు, మరి ఇద్దరితో కలిసి వేటకు బయలుదేరారు. ఆ ఇద్దరిలో ఒకరు వన్యమృగ గార్డు, డాక్టరు గారి బాగ్ పట్టుకున్న రెండవ వ్యక్తి అడుగు జాడలు తీయడంలో చాలా అనుభవమున్న అభయారణ్యంలోని కొండజాతికి చెందినవాడు. వక్రదంతి కోసరం వాళ్ళు ప్రొద్దుటి నుంచి మధ్యాహ్నం వరకు వెతు కుతూనే ఉన్నారు. చివరికి వాళ్ళు దాన్ని చూశారు. దట్టమైన అడవితో కప్పబడిన

ఒక లోయలో అది మేత మేస్తూ కనబడింది. వార్డెన్ చంద్రన్‌కి తన స్టైన్ గన్ యొక్క హద్దులు తెలుసు. రైఫిల్ వలె కాక ఈ గన్ రేంజికి హద్దు ఉంది. సరైన దెబ్బ కొట్టాలంటే అతను జంతువుకి 25 మీటర్ల దూరంలోకి వెళ్ళవలసి ఉంటుంది. మళ్ళీ బుల్లెట్ వలె కాక ట్రాంక్విలైజర్ మందు పనిచెయ్యడానికి కొంత సమయం తీసుకుంటుంది. అందువల్ల, వేట జరిపే ప్రదేశము, సమయము కూడా జాగ్రత్తగా ఎంచుకోవాలి. వక్రదంతి మేస్తున్న లోయ దానిని పట్టడానికి సరైన ప్రదేశం కాదు. గాలి కూడా అంత వీలుగా లేదు. వేటగాళ్ళు ఆ ఏనుగు ఇవతలికి వస్తుందని చాలా ఓపికగా ఎదురు చూశారు. కానీ, అది అంతకు కొన్ని గంటలముందే నీళ్ళు తాగి ఉండటంతో అక్కడినుంచి కదలడానికి తొందరపడటం లేదు. అదే సమయంలో పగటి వెలుగు కూడా తగ్గిపోసాగింది. ఆ రోజుకి వేట ఆపెయ్యాలని నిర్ణయించారు.

మరుసటి రోజు వాళ్ళు తమ పద్ధతిని మార్చారు. వక్రదంతితో వన్యమృగ సంరక్షణాధికారికి మొదటిసారి తటస్థపడిన రాతిమీద వాళ్ళంతా కూర్చుని, అది ఆ దారిన వస్తుందేమో అని ఆశతో ఎదురు చూస్తున్నారు. కాని, ఏనుగు ఆ రోజు నీటికోసం నెల్లిఒడైకి రాకుండా, మరొక మడుగుకు వెళ్ళింది.

వక్రదంతికి ఇచ్చిన గడువులో అయిదు రోజులు గడిచి పోవడంతో చంద్రన్ బాధపడుతున్నాడు. అతను ఎదురుచూడటం మినహా మరేమీ చెయ్యడానికి లేదు. తను త్వరపడి ఏ నిర్ణయం తీసుకున్నా, అది తెలివితక్కువ తనమే అవుతుంది. డాక్టర్ రమేష్ అతని ఆలోచనలని చదువుతూ అతను ఏవిధమైన అఘాయిత్యం చెయ్యకుండా ఆపాడు.

వక్రదంతి నెల్లిఒడై ప్రాంతంలోనే ఉంది కాని, అది అక్కడున్న రెండు మడుగులలో దేనికి వెళుతుందో ఎవరి ఊహకూ అందడంలేదు. దిగువన ఉన్న మడుగు దగ్గర అయితే అది పడుకోవడానికి మంచి ప్రదేశమని తలచి, చంద్రన్ కొంతమంది మనుషులను ఎగువన ఉన్న మడుగు దగ్గరకు ఏనుగు వస్తే అక్కడనుంచి క్రింది మడుగు వద్దకు బాగా గోలచేస్తూ తరమమని నియమించారు. వారికి కొన్ని డబ్బాలు, డప్పులు, టపాకాయలు ఇచ్చాడు. వక్రదంతి మడుగు వద్దకి రాగానే చెట్లమీదున్న ఆ మనుషులు దాన్ని భయపెట్టి తరమడానికి ప్రయత్నించారు. అది ఆ ఏనుగుకి చాలా కోపం తెప్పించింది. ఆ చెట్లని పడదొయ్యడానికి ప్రయత్నించింది. అలాగే మడుగు దగ్గరికి వెళ్ళబోతున్నపుడు వాళ్ళు చేసిన గోల ఏనుగే భరించలేకపోయింది. ఒక్కసారిగా

కోపంతో గట్టిగా  ఘీంకరిస్తూ అది వెనుతిరిగింది.

నెల్లిఒడై ఎగువ మడుగునుంచి అది తరమబడిన తరువాత, ఆ వక్రదంతి  ఎంత కోపంతో ఉందో అంత దాహం కూడా వేసింది. దిగువ మడుగు దగ్గర ఆతృతతో



ఎదురుచూస్తున్న వేటగాళ్ళు అది రావడం చాలా దూరంనుంచే గమనించారు. కాని, దురదృష్టం కొద్దీ అది వారున్న ఒడ్డువైపుకి రాకుండా, అవతలి వైపు నుంచి మడుగు దగ్గరికి వెళ్ళింది. ఏనుగు నిలబడి వున్న ఒడ్డు వేటగాళ్ళు దాక్కున్న చెట్టుకి 40 మీటర్ల కంటె ఎక్కువ దూరంలో ఉంది. వాళ్ళున్న వైపునుంచి గనుక ఏనుగు వెళ్ళివుంటే చంద్రన్ దాన్ని తప్పక కొట్టిఉండేవాడు. ఇప్పుడు విసుగు చెందడం వేటగాళ్ళ పనయింది. కనీసం తిరిగి వెళ్ళేటప్పుడయినా ఏనుగు తమవైపు నుంచి వెళుతుందని వాళ్ళు ఆశతో ఎదురు చూడసాగారు.

అప్పటికే మేత ఆలస్యం కావడంతో దాహం తీర్చుకోగానే ఏనుగు తిండికోసం త్వరపడింది. వేటగాళ్ళు ఆశించినట్టుగా అది వారున్న చెట్టువైపుకే వచ్చింది. వార్డెన్ గురి చూసుకొని, అది సరైన దూరంలోకి రాగానే దానివైపు షూట్ చేశాడు. కాని ఆ బాణం పక్క ఎముకకి తగిలి క్రిందపడింది. అయితే అది రైఫిల్ షాట్ లాగా పెద్ద శబ్దం చెయ్యకుండా తక్కువ శబ్దం చెయ్యడంతో ఏనుగు శబ్దం వచ్చిన దిశను వేరుగా తలచి ఆ వైపుకి దూకింది. అది రేంజి దాటిపోకముందే చంద్రన్ మళ్ళీ లోడ్ చేసి, ఇంకోసారి పేల్చాడు. కాని, ఆ బాణం కూడా ఒక కోణంలో దానికి గుచ్చుకోవడంతో ఆ వేటగాళ్ళు అది దాని శరీరానికి ఏ విధమైన మత్తూ కలిగించదని, అసలు మందు శరీరంలోకి వెళ్ళలేదని తెలుసుకున్నారు. వక్రదంతి చాలా కోపంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. వేటగాళ్ళకి సరైన గురి కుదరలేదు. నిరాశతో వాళ్ళు ఇంటికి తిరిగి వెళ్ళిపోయారు. అది ఆరవరోజు.

ఇంటి వద్ద మోహన్ వాళ్ళని లోపలికి ఆహ్వానించినపుడు స్వయంగా చెప్ప కుండానే, వాళ్ళు అపజయం పొందారని తెలిసిపోయింది. వారు విచారంగాను, ముభావంగానూ ఉన్నారు. భోజనం దగ్గర మోహన్ గాలి కూడా స్తంభించినట్లు అనుభూతి చెందాడు. వాళ్ళమధ్య చాలా తక్కువ మాటలు నడిచాయి. అతని తండ్రి మళ్ళీ ఇంకొక ప్రయత్నం చెయ్యడమా లేక వదులుకోవడమా అని ఆలో చిస్తున్నట్లు మోహన్‌కి తెలుసు. కొద్ది సేపటికి నిశ్శబ్దంపోయి, ఉద్రిక్తత కాస్త సర్దుకుంది. చంద్రన్ ఎప్పటిలా నవ్వుతూ ఛలోక్తులు విసిరాడు. డాక్టర్ రమేష్ తన స్నేహితుడు ఒక నిశ్చయానికి వచ్చాడని తెలుసుకున్నాడు. ఏనుగు వెనకాల వెళ్ళడమేకాక దానిని తప్పకుండా పట్టాలని అతను నిర్ణయించుకున్నాడు. అతని ఆలోచన మంచిది. చంద్రన్ పరిస్థితిని గురించి తీవ్రంగా ఆలోచిస్తూ అతని అవకాశా

లను బేరీజు వేసుకుంటున్నాడు. రైఫిల్ ఉన్నా, నడకతో వక్రదంతిని అనుసరించడం ఎంతో ప్రమాదంతో కూడుకున్నది. అయినా సరే వేటలో అపజయం పొందితే వారం కాగానే వక్రదంతి మరణానికి అది సూచన అవుతుంది.

మరుసటి రోజు అనగా గడువు చివరి రోజున వేటగాళ్ళ బృందం తెలవారుతుండ గానే బయలుదేరారు. వన్యమృగ సంరక్షణ అధికారి ముందురోజు సాయంత్రం అడుగు జాడలని బట్టి, వాసనని బట్టి ఏనుగు ఎక్కడుందో పసిగట్టే ప్రయత్నం చేస్తున్నాడు. ఆయన స్నేహితుడైన రమేష్ గాని, గార్డుగాని గాయపడటం ఆయన కిష్టం లేకపో వడంతో తాను ముందు నడుస్తూ సురక్షితమైన దూరంలో తనని అనుసరించమని చెప్పాడు.

వాసన స్పష్టంగా ఉండి, అనుసరించడం సులభమైంది. కాని, వన్యమృగ సంరక్ష కుడు చాలా జాగ్రత్త తీసుకోవలసి వచ్చింది. అతను అడుగు జాడలని పసికట్టడంలో తన దృష్టిని కేంద్రీకరించడం మాత్రమే కాక, ఏనుగు ఎక్కడ ఉందో తెలియదు కనుక ప్రతిక్షణం అప్రమత్తంగా ఉండి, దానికోసరం చూస్తూ ఉండాలి. అందువలన వారి గమనం నెమ్మదిగా సాగుతుంది.

వక్రదంతి దారిలో ఒక్కసారి మాత్రమే మేత కోసం ఆగి, చాలాదూరం నడిచి పోయింది. చివరికి, వార్డెన్ దానిని చేరుకునే సరికి మధ్యాహ్నమయిపోయింది. అది మోకాళ్ళ లోతున పెరిగి, పాక్షికంగా ఎండిన గడ్డిలో నిలబడి, గడ్డిని తింటూ ఉంది. వన్యమృగ సంరక్షకుడు తమ వాసన వక్రదంతికి తెలియకూడదని తను బయలుదేరిన దగ్గరనుంచి గాలి వాలును పరీక్ష చేస్తున్నట్లే ఇప్పుడు కూడా పరీక్ష చేశాడు. చేతినిండా ఎండిన ఆకులను నలిపి, పైకి గాలిలోగి ఎగురవేసి, అవి వెళ్ళే దిశని బట్టి అతను గాలి వాలును తెలుసుకుంటున్నాడు. హంతకునికి తన ఉనికి తెలియదని తృప్తిపడిన తరువాత అతను పచ్చికబయలు అంచున ఉన్న ఒక చెట్టు వెనక కూర్చుని, ఆ ఏనుగు తనకనుకూలమైన స్థలంలోకి వచ్చేవరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

కాని, ఏనుగు కదిలే సూచనలు కనబడలేదు. నీడలు పొడవుగా పరుచుకోవడం మొదలు పెట్టాయి. ఇంకా ఎదురుచూస్తే చాలా ఆలస్యమయిపోతుంది. అంతేకాదు, ఏడురోజుల గడువు పూర్తయిపోతుంది. అది వార్డెన్‌కి ఆఖరి అవకాశం. అందుకే అతను ఏమయినా సరే వదలకూడదనుకున్నాడు.

అతడు లేచినిలబడి, తన స్టైన్‌గన్ ఒకసారి సరిచూసుకున్నాడు. అతనికి ఒక్క

ఆశ లోపల దాగివుంది. ఆ గన్ ఎక్కువ శబ్దం చెయ్యదు కనుక తను షూట్ చేశాక ఏనుగు మీద మందు ప్రభావం చూపేవరకు పడుకుని దాక్కోవచ్చు అనుకున్నాడు. చంద్రన్ సాధ్యమైనంత వరకు అక్కడక్కడ ఉన్న పొదలు, గుంటలను చాటు చేసుకుంటూ నిశ్శబ్దంగా పెద్దపులి లేడిని సమీపించినట్లు తనవేటను సమీపించాడు. అతను హంతకుని సమీపిస్తున్న కొద్దీ ప్రమాదం హెచ్చవుతూ ఉంది. అతని గుండె కొట్టుకునే శబ్దం అతనికే వినిపిస్తూ, అసలు గన్‌ని సరిగ్గా పట్టుకోగలనా అనే అనుమానం కూడా వచ్చింది. అతను సరైన దూరంలోకి చేరుకున్న తరువాత, ఒక దుర్బల వృక్షం వెనుక దాగి, గన్‌ని దానికి ఆనించి, గురి చూసి పేల్చాడు.

వక్రదంతి అతనికి వ్యతిరేక దిశలో ముఖం పెట్టి ఉంది. ఆ బాణం దాని భుజాల దగ్గరున్న కండ ప్రదేశంలో గుచ్చుకోగానే అది కంటికి కనిపించక జంకింది. వెనక్కు తిరిగి, తనను కొట్టిన దేమిటా అని చుట్టూ చూసింది.

సరిగ్గా అప్పుడే గాలివాలు మారి, వార్డెన్ వాసనని వక్రదంతి పసిగట్టింది. దానితో దాని హంతక గుణం ఒక్కసారిగా నిద్రలేచింది. చంద్రన్ తన ఆట ఇంక అయిపోయిందని, కేవలం ఆ ఏనుగుకి దూరంగా పరిగెత్తడమే తనను రక్షించగలదని తెలుసుకొని, త్వరగా పరిగెత్తాలని నిశ్చయించుకున్నాడు.

వార్డెన్ ఒక్క ఉదుటున లేచి, తనకాళ్ళు తనకి ఎంత వేగాన్నిస్తే అంత వేగంగా వక్రదంతికి దూరంగా పరిగెత్తసాగాడు. హంతకుడు వేటగాడ్ని చూసి, వెంట తరమసాగాడు. చప్పుడు లేని, ప్రాణాంతకమైన, దృఢచిత్తం గల హంతకుడు చంద్రన్‌ని వెంటాడుతున్నాడు. అడవి పలచగానే ఉన్నప్పటికి మానవునికి ఎన్నో అవరోధాలుంటాయి. కాని, ఏనుగుకు మాత్రం కొన్నే అడ్డంకులు ఉంటాయి. ఎంత దట్టమైన పొదలయినప్పటికీ అది వాటిని కూలదోసి దాటి పోగలదు. అవరోధాలను దాటుకుంటూ చంద్రన్ పరిగెత్తేటప్పటికి ఏనుగు వేగంలో అతనిపై గెలుపొందసాగింది. వార్డెన్ తన గన్ అనవసరమైన మోత బరువని భావించడంతో దాన్ని విసిరిపారేయడం ద్వారా మరికొంత వేగాన్ని పుంజుకున్నాడు. కాని, అతను అన్ని విధాలా ఎంతో జాగ్రత్త వహించవలసి ఉంది. ఒక్క తప్పటడుగు, ఒక్క తొట్రుపాటు, అతని జీవితాన్నే అంతం చేస్తాయి.

అది చాలా దగ్గర పరుగు పందెం. ఏనుగు మెరుపు మెరుపులా అతని వెనుక పడింది. అదృష్టం కొద్దీ వాళ్ళు అడవి దారిలోకి వచ్చేయడంతో వార్డెన్ ఏనుగు కంటె

కొన్ని ముందుగా పరిగెత్తగలుగుతున్నాడు. కాని, ఇలా ఎంతసేపు? ఆ ఏనుగు తన గాయం బాధతో కూడ ఇలా అలిసిపోక వెంటబడి తరుముతున్నదిగాని, వేటగాడు త్వరగా అలిసిపోతున్నాడని అతను ఆశ్చర్యపోతున్నాడు.

వక్రదంతి బాగా దగ్గరికి వచ్చేసి, వార్డెన్‌ని పడగొట్టాలని తన తొండం ఎత్తింది. కానీ, ఆ ఏనుగు అధికంగా శ్రమ పడటం వలన అకస్మాత్తుగా మందు ప్రభావం



చూపించింది. నెమ్మదిగా కదిలే సినిమాలా తొండం మెల్లిగా కిందకి దిగిపోయింది. కాళ్ళు తప్పబడి, తొట్రుపాటుతో కిందపడిపోయింది. ఏనుగు పడిపోయిన శబ్దం విన్న వార్డెన్ ఆగిపోయాడు. వక్రదంతి లేవకపోవడంతో అతను ఈల వేశాడు. డాక్టర్ రమేష్, గార్డు అది వినగానే పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ ఏనుగు సాచుకుని పడుకుని ఉంది. ఆ దృశ్యం చూడటానికి భయం కలిగిస్తోంది. వాళ్ళు దాన్ని జాగ్రత్తగా పరిశీలించి, మత్తు ప్రభావం వలన అది భారంగా దీర్ఘంగా ఊపిరి పీల్చడం విన్నారు. జాగ్రత్తగా దానిని సమీపించారు. డాక్టరు కొన్ని పరీక్షలు చేసి, తను శస్త్ర చికిత్స చేసేవరకు అది మత్తులో ఉంటుందో లేదో అని నిర్ధారించుకున్నాడు. అదృష్టంకొద్దీ ఏనుగు గాయం బయటి వేపుకే ఉండేటట్లు పడింది. అది చాలా లోతైన గాయం. డాక్టరు రమేష్ ఆ గాయాన్ని తెరిచినపుడు దానిలో ఉన్న చీము, రక్తం ఒక్కసారిగా బయటకి తన్ని, డాక్టరు దుస్తులనిండా చిమ్మింది. "పాపం ఈ ఏనుగు ఎంత బాధ అనుభవించిందో" అన్నాడు డాక్టరు.

"అతను హంతకునిగా మారడంలో ఆశ్చర్యం లేదు" అని వార్డెన్ గొణిగాడు.

డాక్టరు గాయాన్ని లోతుగా పరీక్షించి అందులో నుంచి పాతకాలపు తుపాకీ నుంచి పేల్చిన మూడు సీసపు ముక్కలని బయటికి తీసి, వార్డెన్‌కి ఇచ్చాడు. వక్రదంతికి బాగా ఇష్టమయిన పైరుకి యజమాని అయిన వ్యవసాయ దారుడెవరో ఈ పని చేసి ఉండవచ్చు అని తగ్గుస్వరంలో కోపంగా అన్నాడు చంద్రన్.

డాక్టర్ రమేష్ గాయాన్ని శుభ్రం చేసి, గాయం త్వరగా మానడం కోసం దాని నిండా యాంటీ బయాటిక్స్ మందులను పోసి, డ్రస్ చేసి, కుట్లేశాడు. అప్పటికి ఇంకా ఆ ఏనుగు లేచే సూచనలు కనబడక పోవడంతో మత్తుమందుకి విరుగుడు ఇచ్చాడు. తరువాత, వాళ్ళంతా దూరంగా ఒక సురక్షిత ప్రదేశం చేరుకుని, అక్కడినుంచి చూడసాగారు.

కొద్దిసేపటి తరువాత, పడిపోయిన ఏనుగుకి మెలకువ వచ్చింది. తరువాత మెల్లిగా అది లేచి నిలబడింది. అది వాళ్ళున్న వైపుకి తిరిగినపుడు దాని కుడివైపు దంతం ఎడమ వైపు దంతం మీదకి వచ్చేచోట విరిగిపోయి ఉండటం చూశారు. అది పడిపోయినపుడు దాని బరువుకి దంతం విరిగింది. ఆ మగ ఏనుగు ఇప్పుడిక ఏమాత్రం వక్రదంతి కాదు. అది అప్పటివరకు అనుభవించిన బాధ మటుమాయమై పోగా తన తొండాన్ని స్వేచ్ఛగా ఎటుబడితే అటు కదిలించ గలిగింది. తనమీదనుంచి

ఏదో పెద్ద భారం తొలిగిపోయినట్లుగా భావించింది ఏనుగు. ఇకముందు మానవులు పండించే పైరులపై ఆధార పడవలసిన అవసరం దానికి లేదు

ఏనుగు వాళ్ళిద్దర్నీ చూసింది. కాని, వారిపై దాడి చెయ్యడానికి ప్రయత్నించ లేదు. అది తన తొండాన్ని పైకెత్తి గాలిలో అటూ ఇటూ కదిల్చినపుడు తమకి అభినందనలు తెల్పడానికి ప్రయత్నిస్తోందా అనుకుని వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు.

# రాత్రి కాపలా

నాన్నగారూ, నా సెలవులు తొందరలో అయిపోతాయి కనుక నేను 'షెన్‌బాగా ఊరాని'లో ఒక రాత్రి జంతువులని పరిశీలిస్తూ గడపాలని ఉంది అని ఒక రోజు ఉదయం మోహన్ తన తండ్రికి చెప్పాడు.

అతని తండ్రి అందుకు అంగీకరించాడు. అంతేకాదు "ఇది మంచి సమయం కూడా, ఇవి వెన్నెల రాత్రులు కనుక చంద్ర ప్రకాశంతో స్పష్టంగా ఉంటాయి అనికూడా, ఆయన అన్నాడు. మోహన్‌కి చాలా సంతోషంగా వుంది. నిజానికి ఈ విషయం గురించి నేనూ ఆలోచిస్తున్నాను" అంటూ ఆయన కొనసాగించాడు. "దొంగ వేటగాళ్ళపై నేను ఒక కన్ను వేస్తూ ఈ ప్రదేశంలో వన్యమృగ జీవితాన్ని కూడా పరిశీలించవచ్చు. ముఖ్యంగా పెద్ద జంతువులు ఈ కరువు పరిస్థితిలో ఎలా గడుపుతున్నాయి అని" అన్నాడు.

మధ్యాహ్న భోజనం త్వరగా ముగించేసి వాళ్ళు బయలుదేరారు. దారిలో వాళ్ళు వక్రదంత ఏనుగుని కలుసుకున్నారు. దాని దంతం విరిగిపోయినప్పటికీ, ముందున్న అలవాటు ప్రకారం అభయారణ్యపు ఉద్యోగులు దానిని ఇంకా వక్రదంతి అనే పిలుస్తున్నారు. వక్రదంతి దారి ప్రక్కనే శాంతంగా మేస్తూ ఉంది. వాళ్ళను పట్టించుకోనట్లే అది అతన్ని దాటిపోనిచ్చింది. దాని గాయం చక్కగా మానుతున్నట్లు వార్డెన్ గమనించాడు.

వాళ్ళు 'షెన్‌బాగా ఊరాని' చేరేసరికి మధ్యాహ్న సమయం గడిచిపోయింది. అక్కడ మడుగు ఒడ్డున మామిడి చెట్టుమీద దొంగవేటగాళ్ళు నిర్మించిన మంచె ఇంకా అలాగే ఉంది. కాని, కొంతకాలంగా దాన్ని ఉపయోగించక పోవడంతో కొన్ని ప్రదేశాలలో అది బోడిగా ఉండి, పచ్చని ఆకులతో కప్పవలసిన అవసరం కనబడింది. కొన్ని చిన్న చిన్న కొమ్మలు కూడ బెట్టమని మోహన్‌కు చెప్పి, వన్యమృగ సంరక్షకుడు మడుగు వద్దకు వెళ్ళి ఆ మడుగు వద్దకు వచ్చివెళ్ళిన జంతువుల అడుగుజాడలు పరీక్షించసాగాడు. తను చూసిన వాటితో అతను సంతృప్తిపడ్డాడు. అక్కడికి చాలా జంతువులు వచ్చి వెళుతున్నాయి.

ఒక వెదురు బొంగు ప్రక్కలలో మెట్లుగా చెక్కి నిచ్చెన తయారుచేసి, మంచె వరకు వేయబడింది. మోహన్ ఎప్పుడూ అటువంటి దానీ మీదుగా ఎక్కలేదు. దానిమీద అతను కోతిలాగా ఎక్కవలసి వచ్చింది. మొదట్లో ఉల్లాసంగా ఉన్నా,

పైకి ఎక్కిన కొలదీ అటూ ఇటూ ఊగుతూ ఎక్కడం కష్టమయింది. మంచెమీద అడుగుపెట్టగానే తేలికగా ఊపిరిపీల్చాడు.

మామిడి చెట్టు రెండు కొమ్మల మధ్యన కొన్ని వెదురు బొంగులతో అడవి తీగలతో కట్టి ఆ మంచె ఏర్పాటు చేయబడింది. ఇంకా కొన్ని వెదురు బొంగులు ఆ మంచె చుట్టూ కట్టబడి ఉన్నాయి. మంచె చుట్టు ప్రక్కల కట్టబడిన చెట్టు కొమ్మలూ, తీగలూ వ్రేలాడుతూ ఆ మడుగు దగ్గరకు వచ్చే జంతువుల దృష్టినుంచి మంచెమీద కూర్చునే మనుషులని మరుగు పరుస్తున్నాయి. జంతువుల కంట వాళ్ళు పడకుండా, వాళ్ళు మాత్రం వాటిని చూడటానికి అక్కడ కూడా చిన్న రంధ్రాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి. మంచెమీద నలుగురు కూర్చోవడానికి, ఇద్దరు పడుకోడానికీ సరిపడిన స్థలముంది. మడుగును, చుట్టు ప్రక్కల ప్రదేశాలని చక్కగా తిలకించడానికి ఆ మంచె ఎంతో అనువుగా ఉంది.

ఒక క్రమమైన ఆకారంలో లేని ఆ మడుగు సగం వరకే నీటితో నిండి వుంది. మామిడి చెట్టు వైపుగా ఉన్న మడుగు గట్టు రాతిమయంగా ఉండి, నీరు తేటగా ఉంది కాని, అవతలి గట్టు లోతుగాను, బురదతోను నిండి వుంది. మడుగు చివరి వరకు దారి చక్కగా చదును చేసినట్లుగా ఉంది. ఆ మడుగు, దాని పరిసరాలు చల్లగా, పచ్చగా అడవిలోని వేడికి, ధూళికి వ్యతిరేకంగా ఉండి ఎడారిలో ఒయాసిస్సులా ఉన్నాయి.

అది మిట్టమధ్యాహ్న సమయం కావడంతో మోహన్‌కి మంచెమీద చాలా వేడిగా, ఉక్కగా అనిపించింది. మోహన్ తండ్రి మంచె మీదనుంచి ఒక ఎండిన ఆకుని తీసుకుని, ప్రక్కగా జారవిడిచాడు. అది తిన్నగా రాయిలాగా క్రిందికి వెళ్ళిపోయింది. అడవిలోని నిశ్శబ్దాన్ని భంగపరచడం ఇష్టంలేక మోహన్ తండ్రి చేతులతో సైగచేస్తూ మడుగు దగ్గరకి వచ్చే జంతువులకి తమ వాసన తెలిపేందుకు గాలి లేదు అని మోహన్‌కి తెలియజేశాడు. వన్యమృగాలలో ముఖ్యంగా మొక్కలని తినే జంతువులలో వాసన గ్రహించే శక్తి చాలా అభివృద్ధి చెంది ఉండి, సరైన పరిస్థితిలో చాలా దూరం నుంచి కూడా మానవుల ఉనికిని కనిపెట్టగలవు. వారి వాసనని మోసుకెళ్ళే గాలి లేకపోవడంతో వన్యమృగాలని పరిశీలించే అవకాశం వారికి మరింత ఎక్కువయింది.

## II

మడుగు వద్దకి మొదటిగా వచ్చినవి చిన్న చిన్న పక్షులు. బుల్‌బుల్‌లు, అడవి మైనాలు గుంపులు గుంపులుగా తమ దాహం తీర్చుకోవడానికి వచ్చాయి. నీళ్ళు తాగిన తరువాత, అవి మడుగులో దూకి, రాళ్ళమధ్యవున్న సందులలో గట్టిగా

కలకల ధ్వనులు చేస్తూ స్నానం చేశాయి. వాటిని చూస్తుంటే మోహన్‌కి తన సహ విద్యార్థులు పిక్నిక్‌లో ఉన్నపుడు చేసే అల్లరి గుర్తువచ్చి, వాటిని ఉల్లాసంగా చూడసాగాడు.

అవి స్నానం చేస్తూ ఆనందిస్తుంటే ఒక డేగ చాటుగా వచ్చి పొడవాటి చెట్టు నీడలో కూర్చుని ఆ పక్షులని పొంచి చూస్తూ ఉండటం మోహన్ గమనించాడు. మోహన్ దాని ఆంతర్యం కనిపెట్టి, గట్టిగా అరిచి పక్షులని హెచ్చరిద్దామనుకున్నాడు. అతని ఆలోచనలను చదివినట్లు అతని తండ్రి తలని అడ్డంగా వూపాడు. పాపం ఆ డేగ కూడా బ్రతకాలి కదా! మరి దాని ఆహారం చిన్న పక్షులేగా అని మోహన్ పెద్ద జంతుశాస్త్రజ్ఞునిలా ఆలోచించాడు. అంతేగాక అభయారణ్యంలోని శాంతికి భంగం కలిగించరు. వాళ్ళు మళ్ళీ చూసేసరికి, ఆ డేగ ఒక్కసారిగా ఎగిరి, గాలిలో తుపాకీ గుండులా దూసుకెళ్ళి, ఒక బుల్ బుల్‌ని కాళ్ళ మధ్య పట్టుకొని, తిరిగి తన స్థలానికి ఎరతో సహా వచ్చి కూర్చుంది. ఆ బుల్ బుల్‌తో బాటు స్నానం చేస్తున్న తోటి పక్షులన్నీ భయంతో గోలగా అరుస్తూ అక్కడినుంచి ఎగిరిపోయాయి.

అక్కడ మళ్ళీ ప్రశాంతత ఏర్పడిన తరువాత ఒక లంగూర్ కోతుల గుంపు సులభంగా అందంగా చెట్లలో ఊగుతూ అక్కడికి వచ్చాయి. మడుగు దగ్గిరగా వచ్చాక, అవి వెంటనే తిన్నగా కిందికి రాకుండా ఒక కొమ్మనుంచి మరో కొమ్మకి, ఒక చెట్టునుంచి మరో చెట్టుకి దూకుతూ, తమ శత్రువు లెవరయినా ఉన్నారేమో అని చాలా జాగ్రత్తగా చూశాయి. అంతా సరిగ్గా ఉందని తృప్తిపడిన తరువాత, ఒక దానివెనుక ఒకటి మడుగులో నీరు త్రాగడానికి కిందికి వచ్చి, రాళ్ళు ఉన్న గట్టువైపు వెళ్ళాయి. తల్లి పొట్టకి వ్రేలాడుతున్న చిన్నికోతులు కిందికి దూకి ఆడుకున్నాయి. అవి చేసే పనులు చూడటానికి చాలా చిలిపిగా, తమాషాగా వున్నాయి.

లంగూర్‌లని పరిశీలించేటపుడు మోహన్ దృష్టిని అప్పుడే ఎగురుతూవచ్చి, మామిడి చెట్టు క్రిందికొమ్మ మీద వాలిన ఒక పక్షి ఆకర్షించింది. ఆ పక్షి అందం అతన్ని పరవశుడ్ని చేసింది. తన తండ్రి బైనాక్యులర్స్‌తో దానిని మరింత దగ్గరగా పరిశీలించి ఆశ్చర్యపడ్డాడు. ఆ పక్షి బుల్ బుల్ సైజులో ఉండి, తెల్లని రంగుతో తల పైన భాగం మాత్రం నల్లని ఈకలతో ఉంది. పక్షిలో ముఖ్యమైన ఆకర్షణ దానితోక.



రెండు పొడవైన తెల్లని ఈకలు రిబ్బనులవలె తోకభాగాన వేలాడుతూ ఉన్నాయి.

అది మగ దాసరి పిట్ట. దాని చక్కని తోక తడవకుండా ఎలా నీళ్ళు తాగుతుంది? అని మోహన్ ఆశ్చర్యపోయాడు. పక్షివి గురుతూ వెళ్ళి కిందికి తిన్నగా దిగుతూ, మడుగు పైభాగం సమీపించగానే నోరుతెరచి, నోటినిండా నీళ్ళు తీసుకుని, మళ్ళీ తిన్నగా పైకి ఎగిరింది. ఆవిధంగా అది రెండుసార్లు చేసింది. ఆ అడవి ప్రదేశంలో అస్త మిస్తున్న సాయంకాలపు వెలుగులు బంగారు కాంతులీనుతూ ఆ పక్షి అద్భుత కృత్యా నికి అందమైన సన్నివేశం సృష్టించాయి.

నీటి మడుగుకు తరువాతి అతిథులు భారతదేశంలో ఎక్కువగా చీటల్ అని పిలువబడుతున్న మచ్చల జింకలు. అవి సంశయంతో వస్తూ ఉన్నాయి. పెద్ద మగ జింక వాటికి నాయకత్వం వహిస్తూ దారి తీస్తుందని మోహన్ ఆశించాడు. కాని, వాటిలో నుంచి ఒక ముసలి ఆడ జింక ముందుకి వచ్చింది. అది బయటికి రాగానే ఒక నరాల పోగులా కనబడింది. చాలా తక్కువ శబ్దంతో అది తన ముందు పాదా లని నేలమీద మోపుతూ ముందుకు పరిగెత్తింది.

నెమ్మదిగా అడుగులో అడుగు వేసు కుంటూ నీటి ఒడ్డుకు చేరి, కాసేపు అలా నీటి వైపు చూస్తూ నిలబడింది. తరు వాత, నీళ్ళు త్రాగడానికి తలని వంచింది.



కాని, అప్పటికి గూడా అది ఇంకా అనిశ్చయంగానే ఉన్నట్లు కనబడింది. దగ్గరలో తన శత్రువులు ఎవరయినా ఉన్నారేమో అని చివరిసారిగా చూసి నిర్ధారించుకోడానికి అకస్మాత్తుగా అది తన తలని కొద్దిగా ఊపి పైకెత్తింది. చివరికి, నీళ్ల త్రాగడం కోసరం అది తన తలని కిందికి వంచింది. దూరంగా నిలుచుని చూస్తున్న జింకల మందకు అది ఒక సంకేతంగా పనిచేసి, నీళ్ళు త్రాగడం కోసం అవి ఒక్కుమ్మడిగా పరిగెత్తుకొచ్చాయి. ఆ మందలో వెనకన ఉన్న పెద్ద పెద్ద మగ జింకలు మందలో నుంచి తోసుకుంటూ మంచి స్థానం కోసం చొచ్చుకు రావడం మోహన్‌ని చకితుణ్ణి



చేసింది. ఆ జింకలు మడుగు వద్ద చాలాసేపు ఉండిపోయాయి. జింకపిల్లలు ఆడుకుంటుంటే, రెండు పెద్ద పెద్ద మగ జింగలు పోట్లాడుకున్నాయి. అవి తమ తలలు వంచి, ఒక దానితో ఒకటి తలలతో పొడుచుకుంటుంటే వాటి కొమ్ములు ఢీకొని పెద్ద శబ్దం వస్తుంది. తరువాత ఆ పోట్లాట ఒకదాన్నొకటి తోసుకోవడం లోగి దిగింది. ఆ రెంటిలో బలహీనమైన జింక వెనక్కు తిరిగి దూరంగా వెళ్ళిపోయేవరకు అలా చాలాసార్లు పోట్లాడుకున్నాయి. గెలిచిన జింక ఓడిన జింక వెనుక వెళ్ళి, దాన్ని తన కొమ్ములతో పొడిచి, అంతం చేస్తుందని మోహన్ అనుకున్నాడు. కాని, అది ఆ విధంగా చెయ్యలేదు. జంటకట్టే తరుణంలో మందలో అన్నిటికంటె బలమైన



జింక మందకి నాయకత్వం వహించేది. తేల్చుకోడానికి తరచుగా అలాంటి పోట్లాటలు జరుగుతూనే ఉంటాయి. నాయక జింక సాధారణంగా తన నాయకత్వానికి సవాలు గాని, ముప్పు గాని వస్తే తప్ప ఇతర జింకలతో తలపడదు. అప్పుడు మరో పోట్లాట ఉంటుంది. సాధారణంగా మందకి నాయకత్వం శాశ్వతమైన ఏర్పాటుగా ఉంటుంది. ఈ మందలో నీటి మడుగుకు దారి చూపినటువంటి ముసలి జింకలు సాధారణంగా మందకి నాయకత్వం వహిస్తాయి. అడివి అంతా రకరకాల శబ్దాలతో నిండిఉంది. అందులో కొన్ని తియ్యగా, కొన్ని కఠోరంగా కొన్ని మెల్లిగా, కొన్ని గట్టిగా, కొన్ని చిన్నగా, కొన్ని పెద్దగా ఉన్నాయి. ఆ శబ్దాలలో కొన్నిటిని మోహన్ సులభంగా గుర్తుపట్ట గలిగాడు. మిగిలిన వాటిని గుర్తు పట్టలేదు. సాయంకాలం అవుతుంటే కొన్ని పక్షులు చాలా గోల మొదలు పెట్టాయి. వాటిలో ఎక్కువగా గోల చేసేవి అడవి కోళ్ళు, చిన్న చిలుకలు, పచ్చని బార్బెట్‌లు. అకస్మాత్తుగా ఎవరిమీదో దాడి జరిగి, గొంతు పిసుకుతున్నట్లుగా ఒక తీక్షణమైన అరుపు వినబడింది. మోహన్ తన తండ్రి అక్కడికి పరిగెత్తి, దాడి చేయబడిన ప్రాణిని రక్షిస్తాడని ఆశించాడు. అప్పుడే ఒక నెమలి కుటుంబం గట్టిగా అరుస్తూ, ఎగురుతూ వచ్చి, వాళ్ళ దగ్గరలో ఉన్న ఒక చెట్టుమీద ఆ రాత్రి బసకోసం వాలాయి. ఆ నెమళ్ళే అన్నిరకాల ప్రత్యేకమైన శబ్దాలకూ, ఇందాకటి అరుపులకూ కారణం. వాటి పనులకి మోహన్ గట్టిగా నవ్వేవాడే కాని, నిశ్శబ్దాన్ని భంగపరచకూడదని ఆగిపోయాడు.

రాత్రి ప్రవేశించకముందు మడుగు వద్దకు చివరిసారిగా వచ్చిన అతిధులు గోధుమ రంగులో ఉన్న ముంగిసల జంట. అవి సాధారణంగా మనకి కనిపించే బూడిద రంగు ముంగిసల కంటె చాలా పెద్దగా ఉన్నాయి. రాళ్ళ సందున, ఆకుల మధ్యన తమ ఆహారం కోసం వెతికాయి. అలా చేయడంలో అవి రాతి క్రింద ఉన్న ఒక కోపదారి పాము ప్రశాంతతకి భంగం కలిగించాయి. ముంగిసలని చూడగానే ఆ పాము తన తప్పు తెలుసుకుని పారిపోబోయింది. కాని, పాములని పట్టడంలో చాలా అనుభవస్థులైన ముంగిసలు దాన్ని త్వరగా పట్టుకున్నాయి. అవి దాన్ని పొదలలోకి లాక్కెళ్ళడంతో మోహన్ తర్వాత చూడలేకపోయాడు.

క్రమంగా అడివిఅంతా చీకట్లు కమ్ముకున్నాయి. పగలు సంచరించే జీవులు విశ్రాంతి స్థితికి వెళుతూ, రాత్రి సంచరించే జీవులు వాటి స్థానాన్ని స్వీకరిస్తున్నపుడు ఒక్క క్షణం గాఢమైన నిశ్శబ్దం ఆవరించింది. మొట్టమొదటగా ఆ నిశ్శబ్దాన్ని పగలగొట్టినది "చుక్, చుక్, చుక్, చుక్, ర్-ర్-ర్" అనే ఆసకప్పెర పక్షికూత.

ఆ వెంటనే దాన్ని అనుసరిస్తూ గుడ్లగూబ అరుపు "బు - బూ, బు-బూ" అని వినబడింది. అరణ్యాలలో దారి తప్పిన ప్రజలు ఈ వికృతమయిన అరుపులు విని, పిచ్చివాళ్ళయి, భయంతో వణికిపోయిన కథలు మోహన్ గుర్తుచేసుకున్నాడు.

మసక చీకటిలో కూర్చున్న మోహన్ మామూలుగా కంటె బైనాక్యులర్స్‌తో బాగా కనబడుతుందని అనుకున్నాడు. కాని, అప్పటికీ కూడా అతను తన కళ్ళమీద కంటె చెవుల మీదనే ఎక్కువగా ఆధారపడవలసి వచ్చింది. చందమామ ఉదయించి, ఆ మడుగును పరిసరాలను ప్రకాశవంతం చేస్తుందని అతను ఆశించాడు.



ఆ సుదీర్ఘ పరిశీలన మోహన్‌కి అలసట కలుగజేసింది. వెదురు బొంగుల మంచె గట్టిగా, ఎగుడుదిగుడుగా ఉందనిపించి, అతని స్థితిని మార్చుకోవాలనుకున్నాడు. తనని విసిగిస్తూ కుడుతున్న దోమల, కీటకాల కాట్లను తుడుచుకోవాలనుకున్నాడు. తిమ్మి రెక్కుతున్నకాళ్ళను సాచుకోవాలనుకున్నాడు. గొంతు సవరించుకోవాలని తుమ్మాలనీ, వీటన్నిటికంటె ముందు మాట్లాడుతూ, తన తండ్రిని వంద ప్రశ్నలు అడగాలని అనుకున్నాడు. కాని, అక్కడికి వచ్చే జంతువులు అలికిడికి పారిపోతాయనే భయంతో అందులో ఏ ఒక్కటీ చెయ్యలేకపోయాడు. బొమ్మలా కదలకుండా కూర్చుని ఉన్న తండ్రివైపు ఆరాధనతో చూశాడు. మంచెల మీద కదలకుండా గంటల తరబడి కూర్చుని, తమ ఒంటరితనాన్ని తగ్గించేది ఏదీ లేకపోయినా. ఎదురు చూసేవాళ్ళని గురించి తండ్రి మాట్లాడటం అతను విన్నాడు. ఆ అడవిలో నాటకాలని చూడటం వంటి ఉద్రేకమైన అనుభవం తనకి లభించటం పట్ల తను చాలా అదష్టవంతుణ్ణనీ, కొంతమందికే ఆ అదృష్టం లభిస్తుందనీ అనుకున్నాడు. తన తండ్రిలా ఇంకా కదలకుండా, అసౌకర్యం లేకుండా కూర్చోగలనని ఆశించాడు.

తన తండ్రిని దగ్గరగా పరిశీలించి చూసి, ఆయన విశ్రమిస్తున్నాడని గమనించాడు. ఆయన్ని అనుకరించి, తనుకూడా విశ్రమిస్తే ఆ రాత్రి పరిశీలనను ఆనందించవచ్చని మోహన్ తలచాడు.

మూడు వంతులు నిండుగా ఉన్న చంద్రుడు ఆలస్యంగా ఉదయించాడు కాని, రెండు కొండల మధ్యన ఉదయిస్తున్న చంద్రుని చూసినపుడు చాలా అందమైన దృశ్యంగా గోచరించింది. నక్షత్రాలతో నిండిన ఆకాశంలో చంద్రుడు పయనించడం కనబడుతుంది. నీటి మడుగు ఉపరితలంలో చంద్రుడు మెరుస్తున్న వెండి పడవ నీటిలో సావకాశంగా నడుస్తున్నట్లుగా కనిపిస్తున్నాడు. కప్పలో, చేపలో దూకినప్పుడల్లా నీటిలో కదలికకు ఆ బొమ్మ వేల ముక్కలుగా విడిపోతూ మళ్ళీ నీళ్ళు నిశ్చలంగా ఉన్నప్పుడు అతుక్కుని, ఒక్కటిగా కనిపిస్తుంది.

చెట్లు, రాళ్ళు వెన్నెల కాంతిలో ఆ అడవిలోని నేల మీద రకరకాల ఆకారాలలో నీడలని ఏర్పరుస్తూ ఉన్నాయి. ఆ వెలుగునీడల దోబూచులాటకు తనను సవరించుకోవడం మోహన్‌కి చాల కష్టంగా ఉంది. అతని ఊహలలో ఒక పెద్ద పులి, ఒక చిరుత పులి లేదా ఒక ఎలుగు బంటి ఆనీడలో కదులుతున్నట్లు భ్రమ పెడుతున్నాయి. కాని, ఆ మడుగు చుట్టూ పరుచుకున్న నీడలలో అను ఒక ఆకారాన్ని

కనిపెట్టేసరికి, చంద్రుని కదలికతో ఆ నీడ ఆకారం మారిపోయి, మళ్ళీ మొదటి కొస్తున్నాడు మోహన్. చంద్రుని మీదుగా పయనించే మబ్బులు మోహన్ కళ్ళకి శ్రమ కలిగించడంతో కళ్ళు నీళ్ళకారడం మొదలుపెట్టాయి. అది గ్రహించి, అతని తండ్రి కళ్ళని ఎక్కువ శ్రమపెట్టకుండా, చెవులమీద ఆధారపడమని అతనికి సైగ చేశాడు.

ఎక్కువ సమయం గడవకుండానే అడవి పందుల గుంపు ఒకటి ఒక పెద్ద ఆడ పంది నాయకత్వంలో ఆ మగుగు అవతలిగట్టుకు వచ్చాయి. త్వరగా నీళ్ళు తాగేసి, ఆ పందులు లోపలికి దిగి, బురదలో పొర్లడం మొదలుపెట్టాయి. అలా వాటి శరీరాలు చల్లబరుచుకున్నాక, ఆ పందుల మంద బయటికి వచ్చి, కీటకాల కోసం, పురుగుల కోసం నేలను తవ్వుతూ, రాలిపోయిన కాయలను, దుంపలను, తింటూ మెల్లిగా సాగిపోయాయి. అవి సర్వభక్షకులు కనుక, వాని ఆహారాన్ని ఎంచుకునే పట్టింపు వాటికి లేదు. కాని వీటి బంధువులైన ఊర పందులతో పోల్చితే ఇవి శుభ్రమైన ఆహారం తీసుకుంటాయి.

కొన్ని నిముషాల తర్వాత, పెద్ద భయంకర ఆకారంలో ఉండి, చిన్న వయినా వాడియైన దంతాలను కలిగి, ఇంతకుముందు వచ్చిన మందలోని ఆడపందికంటె రెండింతల పరిమాణం కలిగిన పంది రెండో వైపుకి వచ్చి నీళ్ళు తాగింది. అది నీళ్ళు తాగేటప్పుడు ఒక ఎండు కొమ్మ కింద పడి, నిశ్శబ్దాన్ని చెదరగొట్టింది. ఆ పంది తనమీద దాడి జరగబోతుందని గబుక్కున వెనుతిరిగింది. దంతాలు చంద్రకాంతిలో మెరుస్తుండగా దాని రోమాలు నిక్కబొడుచుకోగా, తల పైకెత్తి కోపంగా గుర్రుమంటూ శబ్దం వచ్చిన వైపుకి తిరిగి నిలబడింది. దానివైపు చూస్తున్న మోహన్ తానే గనుక ఆకలితో ఉన్న పెద్ద పులి అయినాసరే ఇటువంటి యుద్ధ భావాలను చూపుతున్న పందికి దూరంగా ఉంటానని అనుకున్నాడు.

వాళ్ళు తినడానికి కొంత ఆహారం తెచ్చుకున్నారు. కాగితమయితే విప్పేటప్పుడు శబ్దం చేస్తుందని, వన్యమృగ సంరక్షకుడు ఆ ఆహారాన్ని మెత్తని ప్లాస్టిక్ షీట్‌లో చుట్టి తెచ్చాడు. అరణ్యంలోని నిశ్చల నిశ్శబ్దంలో కాగితం మడత శబ్దం కూడా వన్యమృగాల సునిశిత కర్ణపుటాలకు సోకి, వాటి ఏకాగ్రతని భంగ పరుస్తుంది. ఆహారం తీసుకోవడం పూర్తిచేసి, వాళ్ళతోబాటు ఫ్లాస్కులో తెచ్చుకున్న కాఫీ తాగిన తరువాత, మోహన్ తండ్రి ఒకరి తరువాత ఒకరు వంతులవారీగా పరిశీలన సాగిస్తే

బావుంటుందని సూచించాడు. ఒకవేళ అధికమైన ఉత్సాహం కలిగించే దేదయినా ఉంటే పరిశీలిస్తున్న వ్యక్తి నిద్రపోతున్న వ్యక్తిని లేపే షరతు మీద ఆ సూచన అంగీకరించబడింది.



## IV

మొదటి వంతు మోహన్ తీసుకున్నాడు. తీతువు పిట్టల జంట ఒకటి ఎగురుతూ వచ్చింది. కాని, అవి క్రిందికి దిగేముందు మడుగు చుట్టూ చెట్లమీదుగా గిరికీలు కొట్టాయి. అలా చేసేటప్పుడు వానిలో ఒకటి మంచెను, దానిమీదున్న వారిని కనిపెట్టింది. ఒక్కసారిగా అది రెండో దాన్ని హెచ్చరించింది. రెండూ జంటగా ఆ మామిడి చెట్టు చుట్టూ ఎగురుతూ డిడ్-హి-డూ-ఇట్-డిడ్-హి-డూ-



ఇట్ అని పిచ్చిగా అరుస్తూ అరణ్యంలోని జంతుజాలానికి మోహన్, అతని తండ్రి ఉనికిని హెచ్చరిక చేశాయి. మోహన్ తొందరగా అవి వెళ్ళిపోవాలని కోరుకున్నాడు. వారి అదృష్టం కొద్దీ, ఆ పక్షులు తరుచుగా అలా అరిచినప్పటికీ, వాటి హెచ్చరికను ఏవీ గమనించలేదు.

సాధారణంగా ఏనుగుల మంద వచ్చేటప్పుడు వాటి కదలికను బట్టి సులభంగా గ్రహించవచ్చు. మోహన్ ఏనుగుల మంద వస్తున్నట్లు చాలా దూరం నుంచి వానిని చూడకముందే తెలుసుకున్నాడు. ఏనుగులు ఒక దానితో ఒకటి స్పర్శకోసం గట్టిగా ఘీంకరిస్తూ ఉంటాయి. తల్లి ఏనుగులు పిల్ల ఏనుగులను సరిగ్గా ప్రవర్తించమని కోప పడుతూ ఉంటాయి. కాని, పిల్ల ఏనుగులు తమ తల్లుల దృష్టిని తప్పించుకొని, దూరంగా వెళ్ళి, ఒకదానితో ఒకటి సయ్యాటలాడుతూ ఉంటాయి. చెట్ల కొమ్మ లని విరుస్తూ, చిన్న చెట్లను పడదోసి, పైకొమ్మలని, అందుకుంటూ గోలగోలగా తింటుంటాయి.

మడుగు దగ్గరికి రాగానే అవి నీటి అంచుకు పరిగెత్తుకుని వెళ్ళి, తమ దాహం తీర్చుకున్నాయి. అప్పుడప్పుడు నీళ్ళని తమపై జల్లుకున్నాయి. త్వరలోనే అవన్నీ నీటిలో తడిసి, వెన్నెల కాంతిలో తమ సహజ పరిమాణం కంటె పెద్దగా కనిపించాయి. నీళ్ళు తాగేసిన తరువాత, కొన్ని పెద్ద ఏనుగులు తమ పాదాలతో తొక్కి, గిల కొట్టిన బురదను తమపై జల్లుకున్నాయి. ఇతర ఏనుగులు తమ పాదాలతో నేలను తన్నుతూ దుమ్ము రేపి, తమలో తాము, జల్లుకొని, ధూళి స్నానాలు చేశాయి. అవి ఈవిధంగా వెంటనే మురికి చేసుకుంటే ఇంక స్నానం చెయ్యడం వల్ల ప్రయోజనమేమిటి? అని మోహన్ తలచాడు. మరుసటి ఉదయమే అతని తండ్రి ఆ రహస్యం వివరించాడు. ఏనుగులు బురద, ధూళి స్నానాలు చెయ్యడం కేవలం చల్లదనం కోసరమే కాక, వాటి శరీరాన్ని అంటిపెట్టుకుని ఉండే కొణజు మొదలైన కీటక పరాన్నభుక్కులను వదిలించుకోవడానికి కూడా అని ఆయన చెప్పారు.

వాటన్నిటి కంటె చివరగా మడుగువద్దకు వచ్చిన మగ ఏనుగు సరిజోడిగా ఉన్న పొడవైన దంతాలున్న ఘనదంతి. అది చాలా పెద్దగా, మహనీయంగా ఉండటంతో మోహన్ దానిని గొప్పగా ఆరాధించాడు. మందలో ఉన్న కొన్ని మగ పిల్ల ఏనుగులు తమలో తాము ఒక సమూహంగా ఏర్పడి, మోటుగా ఆటలాడటంలో మునిగిపో

యాయి. ఏనుగులు అక్కడినుంచి వెళ్ళిపోయాక, ఆ ప్రదేశం తుఫాను తర్వాత నిశ్శబ్దంగా తోచింది.

సమయం గడిచి, మధ్య రాత్రి అయ్యేసరికి కొన్ని అతిథులు మాత్రమే మడుగు వద్దకు వచ్చాయి. అంతేకాదు, నిద్రపోవడానికి మోహన్ వంతు రావడంతో ఏమాత్రం బాధపడకుండా నిద్రకి ఒరిగాడు. మళ్ళీ తెల్లవారురఝామునే మోహన్ తన వంతుగా తరువాతి పరిశీలన మొదలు పెట్టాడు. అప్పుడు అతనికి ఉత్సాహం కలిగించేదేదీ కనిపించకపోవడంతో మళ్ళీ నిద్రపోయాడు.

అడివి అంతా నిండిన రకరకాల శబ్దాలు మోహన్‌ని నిద్రలేపాయి. మచ్చల జింక కీచుమనే అరుపు, లంగూర్ కోతుల హెచ్చరికతో కూడిన దగ్గుతో కలిసిపోయిన కణుజు గంట వంటి అరుపు ఆ జంతువులు హెచ్చరించబడినట్లు సూచించగా నెమళ్ళుకూడా ఆ బృందగానంలో తమగొంత కలిపాయి. చక్కని గాలి వీస్తూ ఉంది. మోహన్ ఉద్రేకంతో వెంటనే లేచి కూర్చున్నాడు. ఈ జంతువులన్నీ తమని కొల్లగొట్టే జంతువు, బహుశా పెద్దపులి వాసనని, ఉనికిని గుర్తించి లేదా చూసి ఉంటాయని అతనికి నమ్మకం ఏర్పడింది. ఈలోపల అతని తండ్రి కూడా లేచాడు. త్వరలో గాలి స్తంభించి, దానితో బాటుగా హెచ్చరికల శబ్దాలుకూడా సమసిపోయాయి. గాలి ఆ జంతువు వాసనని దాని ఎరకు మోసుకెళ్ళింది. అవి వాటి హంతకుని చూడలేదు.

అక్కడ నిశ్శబ్దం పేరుకుంది. బహుశా హంతకి వెళ్ళి పోయి ఉండాలి లేదా రహస్యంగా ఉండి తన ఎరను గమనిస్తూ ఉండి ఉండాలి. అది భయం వల్ల, అపనమ్మకం వల్ల ఏర్పడిన నిశ్శబ్దం. మోహన్ గాలిలో ఉద్రిక్తతను అనుభవిస్తున్నాడు. అకస్మాత్తుగా అక్కడ పిశాచ సభ జరిగినట్లు తోచింది. ఆ హంతకి దాడి చేసింది. ఏ మందలో నుంచి హంతకి తన ఎరను కొల్లగొట్టిందో ఆ మందలోని జింకలు తిరిగి హెచ్చరికతో అరుపులు ప్రారంభించాయి. కాని, ఎక్కువసేపు కాదు. ఎరగా ఉపయోగపడే జంతువులన్నీ తమని, అడవిలోని ఇతర జంతువులని ప్రమాదం గురించి హెచ్చరించాలని ప్రయత్నించాయి. కాని, హంతకి తన ఎరను తీసుకుపోవడంతో ప్రమాదం తప్పింది. అక్కడ మళ్ళీ కొంత సమయం ప్రశాంతత ఏర్పడుతుంది. కాబట్టే అవన్నీ ఇంతకు ముందు ఏపని చేస్తున్నాయో ఆ పనులు తిరిగి మొదలుపెట్టాయి.

మోహన్ అతని తండ్రి ఆహంతకి ఎవరో తెలుసుకునేందుకు ఎక్కువసేపు ఎదురు చూడనక్కరలేక పోయింది. "ఎ-ఊ-ఉ-అహ్, ఎ-ఊ-ఉ-అహ్" అంటూ అది తిరిగి

తిరిగి గర్జించింది. అది మోహన్ అంతకుముందెప్పుడూ విననటువంటి భయంకర మైన శబ్దం. ఆ గర్జన అడవిలో సముద్రపు అలలా వ్యాపించి, మిగిలిన శబ్దాలన్నిటినీ తుడిచి పెడుతూ, మోహన్ వెన్నులోంచి చలి వణుకు పుట్టించింది. ఆ గర్జనకి జవాబుగా మరో గర్జన దూరంనుంచి వినిపించింది. ఆ పులులు ఒకదానితో ఒకటి అలా మాట్లాడుకుంటున్నపుడు అడవిమొత్తం నిశ్శబ్దంగా వుండి, వింటున్నట్లు కన బడింది. రెండో పులి క్రమంగా దగ్గరకొచ్చి, తనను విందులో భాగానికి ఆహ్వానిస్తున్న మొదటి పులిని చేరిన తరువాత, ఎప్పుడన్నా గుర్రుమన్న ధ్వని తప్ప, ఆ పులులు నిశ్శబ్దంగా భోజనం ప్రారంభించాయి.

సింహాలవలె గుంపులుగా వెళ్ళక, పెద్దపులులు ఒంటరిగానే జీవిస్తుంటాయి. జంట కట్టే తరుణంలో మాత్రమే పెద్ద పులుల జంటలు కనిపిస్తూ ఉంటాయి. ఆడపులి తమ పిల్లలకు వేటాడటం, ఆహారాన్ని సంపాదించుకోవడం నేర్పుతున్నప్పుడు ఎప్పుడ యినా మరో పులి దానితో బాటు ఉండటం కనిపిస్తుంది. వన్యమృగ సంరక్షకుడు అభయారణ్యంలోని ఆ భాగంలో తప్పక రెండు పెద్ద పులులు జీవిస్తున్నాయని నిర్ణయానికి వచ్చాడు. వాటి అడుగుజాడలు అనేకసార్లు ఆయన చూశాడు. కాని, వాటిని మాత్రం అంతవరకు చూడలేదు. పెద్ద పులుల సంరక్షణ ఆయన ప్రత్యేక బాధ్యత కనుక ఆ జంటను చూడాలని ఆయనకి చాలా ఆతృత కలిగింది.

మోహన్ జంతు ప్రదర్శనశాలలో తప్ప మామూలుగా పెద్ద పులిని ఎప్పుడూ చూడకపోవడంతో ఎలాగయినా పులిని చూడాలని గొప్ప ఆశగావుంది. తప్పకుండా ఆ పెద్ద పులులు వస్తాయని అతను చాలా ఆశపడ్డాడు. తెల్లవారుతున్న కొద్దీ మోహన్ ఆశ వదులుకోవడం మొదలు పెట్టాడు. తరువాత, ప్రభాత సమయం దగ్గర వుతున్నపుడు ఒక చిన్న కదలికను అతను గమనించాడు.

అతను చూస్తూ వుండగానే ఒక అద్భుతమైన పెద్ద పులి కనుచూపుమేరలోకి వచ్చింది. దాని శరీరంమీద చక్కని చారలుండి, ప్రతి అడుగులోనూ హుందాతనం గోచరిస్తూ ఉంది. మంచె వైపుగా ఉన్న మడుగు ఒడ్డున నీళ్ళు శుభ్రంగా ఉండ టంతో అది ఆ వైపుకి వచ్చి, రాతిమీదుగా వంగి, నీళ్ళు త్రాగింది. దానికంటె చిన్నపులి మరొకటి దానితో కలిసింది. అది ఆడ పులిలా కనిపించింది. ఆ విషయం మోహన్‌కి తన తండ్రి వాని అడుగుజాడలని పరిశీలించడం ద్వారా తర్వాత ధ్రువపరిచాడు. ఉదయ సూర్యుని కిరణాలు ఆ పులుల శరీరం మీద పడి, చక్కగా మెరుస్తున్నాయి. అది మరిచిపోలేని దృశ్యం. మోహన్ వాటిని ఆసక్తితో

చూస్తుంటే, అతని తండ్రి వాటి గుర్తులని, ముఖాలని తరువాత గుర్తుపట్టడంకోసరం తన మనసులో ముద్రించుకుంటున్నాడు.

మోహన్ బైనాక్యులర్స్ ఎత్తి, వాటిని పెద్ద పులి తలమీదకి ఫోకస్ చేసి చూశాడు. అందులో పెద్ద పులి చాలా దగ్గరగా కనబడటంతో భయంతో చిన్నగా కేకవేశాడు. ఆ శబ్దానికి పెద్ద పులి వెనుతిరిగి మంచెవైపు, అందులో నించి కనబడుతున్న అద్దాల వైపు ఆసక్తితో, అనుమానంతో ఏమాత్రం భయంలేకుండా చూసింది. ఆ విధంగా మోహన్ తన పులిని ముఖాముఖి కలుసుకున్నాడు.

